ప్రధాన సంపాదకులు
**ఆచార్య కె.ఇ.దేవనాథన్,** ఉపకులపతులు

# ఋషుల గాథలు

( ద్వితీయ సంపుటము )

**సంకలనము**

'ప్రజ్ఞారత్న'
**డా॥ విద్వాన్ అమరవాది శేషయ్య**
పరియోజన అధికారి
పరిశోధన - ప్రకాశన విభాగము

శ్రీ వేఙ్కటేశ్వర వేద విశ్వవిద్యాలయము
తిరుపతి - 2017

**Chief Editor**
**Prof. K.E. DEVANATHAN, Vice-Chancellor**

# ṚṢULA GĀTHALU
## (PART - 2)

**Compiled By**
**Dr. AMARAVADI SESHAIAH**
**Project Officer**

**\SRI VENKATESWARA VEDIC UNIVERSITY**
**( Sponsored by the T.T.D., and Recognized by the U.G.C )**
**Alipiri - Chandragiri Bypass Road**
**Tirupati - 517 502**
**2017**

# పీఠిక

శ్రీ గురుభ్యో నమః

శ్రీ గణాధిపతయే నమః

"వేదవాఙ్మయ జ్ఞానమహేశ్వరంబన
వేదర్షి ఋషీశ్వర చరిత ఖ్యాతిగ
వేదసార భరిత సంస్కృతి వెల్గొంద
వేదజ్ఞ పాదంబుల ప్రణతులర్పింతు"

మహర్షుల చరిత్రలు మహితాత్మములు, మహర్షులు మహత్కార్యములకై భువిలో అవతరించెదరు. వారి జప, తప, యజ్ఞ, యాగాది క్రతువుల సమాహారమే తపోఫలదీక్షఫలితాంశపుణ్య ఫలములు. అలాగే పవిత్రమైన గంగానది ప్రవాహములే వారు మనకందించిన ఋక్కులు. ఋక్కులను ప్రవచింపచేయువారే ఋత్విజులు. వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాస, కావ్యాదులే భారతీయ సంస్కృతికి పునాదులు. మన భరతభూమి వేద భూమి. నైమిశారణ్యాది వనముల ఆశ్రమవాసులై ఋషులు లోకకళ్యాణముకోసమై తపో దీక్షను చేపట్టారు.

కావున రాబోయే యువతకు జ్ఞానసంపదను అందించుటలో ఋషిప్రోక్తమైన మన హైందవ సంస్కృతిని భావి భారత జ్ఞానవాహినీ కోవెలలుగా తీర్చిదిద్దుటకు ఆచార్యులుగ పూర్వకాలమున మహర్షులు నదీప్రవాహ గట్లలో ఆశ్రమములను ఏర్పరచుకొని వివిధ శిష్యకోటితో వేదాభ్యాసమును చేయించిన ప్రాంతములే నైమిశారణ్యాది ప్రదేశములు.

ఇక నైమికారణ్య పూర్వగాథ ఇంచుక అవగాహనగా ఇతి వృత్తమును ఇలా తెలుసుకుందాము.

పూర్వము ఒకప్పుడు ఋషులు, బ్రహ్మను భూభాగమున అనువైన ప్రదేశము తమ తపోదీక్షకు చూపమనగా బ్రహ్మ తాను చక్రమును విసరగా, అది సరాసరి భారత భూభాగమున మధ్యప్రదేశమున పడి భూమిలోనికి చీల్చుకొనిపోయినది. కావున బ్రహ్మ యొక్క నిమి(చక్రము) పడిన చోటును "**నైమిశారణ్యముగ**" నాడు ఋషులు తమ తపస్సునకు అనుకూలమైన ప్రదేశముగ ఎంచుకొనిరి. అదే నేడు నైమిశారణ్యముగ మారినది. నాడు సూత శౌనకాది మహర్షులు ఎందరో దీనిని ఆలంబనగ చేసుకొని తమ తపో దీక్షతో యజ్ఞయాగాది కార్యములను సలిపారు. అలాగే వేదవ్యాసుడు కూడ 18 పురాణములను విరచించెనని ప్రతీతి.

కాన అంతటి మహోన్నతమైన ఋషులు వారి జన్మ వివరములను, వారి గొప్పతనము, వారి మహిమలతో సాగిన నాటి ఔన్నత్య విశేషము లను సంగ్రహీకరణముగ రాబోయే తరము వారికి ఒక జ్ఞానసంపద భాండాగారముగ అందించుటయే నా రచనోద్దేశ్యపు మౌలికాంశముగ చేయు చిన్ని ప్రయత్నము. అష్టోత్తర శతనామావళిగ, అష్టోత్తరశతనామ మాలికగ ఆ వేంకటేశ్వరునికి అష్టోత్తర శత దివ్య పుష్పమాలికను భక్తి పురస్సరముగ సమర్పించుటయే ఈ ఋషుల చరిత్రలు - సంగ్రహ పరిశీలన రచనోద్దేశ్యము.

వ్యాసుడు రాసిన 18 పురాణములను సూతుడు, శౌనకాది ఋషులకు నైమిశారణ్యమున చెప్పినట్లు జన ప్రతీతి. అందువలన ఈ నా పొత్తమును మహత్కార్యముగ దైవాంశ సంభూతులై భువినవతరించిన ఋషుల గాథలు - శీర్షికలో 108 మంది దివ్య ఋషుల గాథలను 9 సంపుటములుగ సామాన్య మానవాళికి జన వ్యవహారిక భాషలో అర్థమగునట్లుగ విషయమును అందించుటయే నా ప్రధాన ఉద్దేశ్యము.

ఇక రెండవ సంపుటములో 6 మంది ఋషుల గాథలను గురించి మనము తెలుసుకుందాము.

*******

# కృతజ్ఞతలు

'**ఋషులు గాథలు**' ఈ గ్రంథ సంకలనము కీర్తిశేషులు **శ్రీవిద్వాన్ బులుసు వెంకటేశ్వరులు,** 1970లో రచించిన 'మహర్షుల చరిత్రలు' మహెూదాత్తమైన ఈ గ్రంథమునకు ఉపలబ్ద గ్రంథ సూచికగా నాకు ఉపయోగ పడినది. ఇది ప్రాచీన భారత వర్షమునకు చెందిన మహర్షుల చరిత్ర. ఇట్టి గ్రంథకర్త ఆర్షకవి శిరోమణి విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు గారికి మనసా వాచా కర్మణా నేను కృతజ్ఞుడను.మహెూన్నతమైన అశ్వత్థవృక్షము వంటి ఈ వేదవిశ్వ విద్యాలయమున ఒక కొమ్మగ ఎదుగుటకు గంగా స్రవంతివలె కారణభూతులైన నా శ్రేయోభి లాషులు మాన్యశ్రీ **కె.ఎస్. శ్రీనివాసరాజు**, ఐ.ఎ.ఎస్., జె.ఇ.ఓ., టి.టి.డి. గారికి నేను సర్వదా కృతజ్ఞుడను. నాకు ప్రోత్సాహకారకులైన **ఆచార్య కె.ఇ.దేవనాథన్,** ఉపకులపతి గారికి, నాటి కులసచివులు **శ్రీ జి.ఎస్.ఆర్. కృష్ణమూర్తి** గారికి అలాగే మా పరిశోధన మరియు ముద్రణ విభాగ ఉపనిర్దేశకులు **శ్రీ రాధేశ్యామ్** గారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

ఈ పుస్తకమునకు మూల ప్రతులను అందించిన ప్రాచ్యలిఖిత భాండాగార పరిశోధనలో పనిచేయు **డా॥ యడవల్లి లక్ష్మీశ్రీకాంత్‌శర్మ** నా ఆశీస్సులు. ఇంత చక్కటి పొత్తమును నా సూచనల మేరకు వ్రాసిన **డా॥ అమర్‌కుమార్**, చక్కటి సంగణికమును(డి.టి.పి)గావించిన **యడవల్లి వేంకటేశ్వర శివకుమార్** మరియూ ఈ పుస్తకమును అందముగా తీర్చిదిద్దిన **కొండపి సురేష్ బాబు**లకు సప్తగిరి నాథుడు శ్రీవేంకటేశ్వరుని దివ్యాశీస్సులు. ఈ నా మొదటి ప్రయత్నముగ 'ఋషుల గాథలు' మొదటిభాగ ముద్రణకు సహకరించిన యావత్ బృంద మంతటికి నా కృతజ్ఞతాభి వందనములు.

"సర్వేజనా సుఖినో భవన్తు
సమస్త సన్మంగళాని భవన్తు"

భవదీయులు
**డా॥ విద్వాన్ అమరవాది శేషయ్య**
పరియోజన అధికారి,
పరిశోధన-ప్రకాశన విభాగము.

తిరుపతి.
12-07-2017

## సంకలన కర్త పరిచయము



| | |
|---|---|
| సంకలన కర్త | **డా॥ అమరవాది శేషయ్య** దానశీలులు, సంఘసేవకులు, మరియు ఆధ్యాత్మిక మార్గనిర్దేశకులు |
| తల్లిదండ్రులు | కీ॥శే॥ శ్రీమతి అమరవాది రాజమ్మ, శ్రీ రామకృష్ణయ్యగారలు |
| జన్మస్థలము | నెఱబైలు (పవిత్రపుణ్యక్షేత్రముమైన శ్రీతలకోన సిద్ధేశ్వరస్వామి వారి దేవాలయమునకు 9 కి॥మీ॥ సమీప గ్రామము, ఎర్రావారిపాలెం మండలము, చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము) |
| విద్యార్హతలు | తెలుగు విద్వాన్, ఎమ్.ఏ.తెలుగు, ఎమ్,ఏ, సంస్కృతము, ఎమ్.ఏ. ఫిలాసఫీ, ఎమ్.ఏ. జ్యోతిష్యము, ఎమ్.ఫిల్ తెలుగు, పిహెచ్‌డి తెలుగు. సర్టిఫికెట్ ఇన్ వైష్ణవిజమ్. |
| ఉద్యోగ జీవనము | 29-07-1974 నుండి 31-05-2010 వరకు తమిళనాడు ప్రభుత్వ ఉన్నతోన్నత పాఠశాలలో తెలుగు శాఖ ఉపన్యాసకులు. ప్రస్తుత ఉద్యోగ జీవనము 21-4-2015 నుండి ఇప్పటివరకు పరియోజన అధికారి, పరిశోధన మరియు ప్రకాశన విభాగము, శ్రీ వేంకటేశ్వర వేద విశ్వవిద్యాలయము, తిరుపతి. |
| ఆధ్యాత్మిక జీవనము | 12-06-1988 నుండి ఇప్పటివరకు సహజమార్గ రాజయోగ ధ్యాన మార్గ ప్రక్రియలో బాబూజీ మెమోరియల్ ఆశ్రమము (శ్రీరామ చంద్ర మిషన్ చెన్నై)ద్వారా ధ్యానసాధన అభ్యాసి. |
| ప్రసంగములు | 1980 నుండి ఇప్పటివరకు ఆకాశవాణిలో, తెలుగు సాహిత్యములో మద్రాసు, విజయవాడ, హైదరాబాదు, తిరుపతి కేంద్రములలో ప్రసంగములు. అలాగే 1990 నుండి దూరదర్శన్ కేంద్రములలో మద్రాసు, విజయవాడ, హైదరాబాదులనందు అలాగే ఇతర ప్రవేటు చానల్స్‌లో దాదాపు 110 భాగములలో ఆధ్యాత్మిక ప్రసంగములు. |
| రచనలు | అనుబంధముగా భక్తి సాహిత్యమునకు సంబంధించిన 25 భక్తి రచనలు 'అమరవాది పబ్లికేషన్స్' ద్వారా ప్రచురించడమైనది. |
| బిరుదములు | "ప్రజ్ఞారత్న" |
| దూరవాణి | 9705830573 |
| ఇ.మెయిల్ | dramaravadi@gmail.com |
| చిరునామా | ప్లాట్ నెం. 201, 2వ ఫ్లోర్, పద్మావతి రెసిడెన్సి, కాసాని కౌసల్య కాలనీ, టర్బో మిషనరి దగ్గర, బాచుపల్లి, హైదరాబాద్. కె.వి. రంగారెడ్డి జిల్లా, తెలంగాణ రాష్ట్రం |
| ప్రస్తుతచిరునామా | 18-1-26/ F, ద్వారకానగర్, తిరుపతి-517501, ఆంధ్రప్రదేశ్. |

# విషయసూచిక

**విషయము** **పేజి నెం.**

❖❖❖❖❖

# ఉపోద్ఘాతము

మన భరతవర్షము ఆర్షభారతము అనియు ఆర్యావర్తమనియు పేరు గడించుటకు కారణము పుణ్యతపోధనులైన ఋషులచరిత్రలే కారణములు. పవిత్రమైన మన భరత ఖండమున జన్మించి తమ తపో మహిమచే సృష్టిస్థితి లయకారకులైన వారే మహర్షులు. ముఖ్యముగ వీరు విశ్వసంరక్షణకై త్రిమూర్తుల కార్యములను నిర్వర్తించుటకు ప్రతినిధులై త్రిమూర్తులకు ఆర్తిసమయములలో ఉద్ధారకులై సంరక్షకులైన పరాత్పరులుగ వీరిని చెప్పవచ్చు.

''ఋషిమూలం నదీమూలం తెలియదు'' అన్నట్లుగ మహాపురుషుల యొక్కయు మహా నదుల యొక్క జన్మగాథలు చిత్రాతి చిత్రములు. గౌతమమహర్షి జన్మకథతో ప్రారంభించి ఋషుల గాథలు ఇంచుక పరిశీలించుదము.

# 1. గౌతమమహర్షి

శతపథ బ్రాహ్మణమును అనుసరించి బ్రహ్మమానస పుత్రులలో ఒకడు సప్తర్షులలో సుప్రసిద్ధుడు శృతులను అనుసరించి గౌతమ వంశమున జన్మించిన ఒక మహర్షియే గౌతమమహర్షి. ఈ గౌతమమహర్షియే గౌతమ ధర్మసూత్ర కర్త.

## 1. అహల్యా గౌతముల వివాహ వృత్తాంతము

పూర్వము విష్ణుమూర్తి మోహినీ రూపమును ధరించి త్రినేత్ర సురాసురుల సహితము మోహింపచేయగ అందరును బ్రహ్మ సృష్టిని తక్కువగ తలంచిరి. ఆ కారణమున అధిక ప్రయత్నముతో అందమైన మోహనా కారమగు 'అహల్య'ను బ్రహ్మ సృష్టించి బహుళ నిష్టతో కూడి బ్రహ్మచర్యమున తపస్సు చేయు గౌతమునకు తగిన పరిచర్యలు చేయుటకు నియోగించెను.

బ్రహ్మ మాటలను అంగీకరించి అతనికి కావలసిన హెూమాది కృత్యములకు తగిన సేవలు చేయుచూ కాలము గడుపుచుండెను. ఆమె ఎంత అందచందములను ఒలక పోసినను గౌతముడు ఆమెకు వశము కాకుండెను. మంచి యౌవనమున సౌందర్యముతో ప్రకాశించెడి ఆమెను గౌతముడు తీసుకొని వెళ్ళి బ్రహ్మదేవునికే అప్పచెప్పెను. ఆ సమయమున బ్రహ్మ ఆ అహల్యను గౌతమునికే ఇచ్చి వివాహము చేయ సంకల్పించెను. కాని అట్టి త్రిలోక సుందరియగు ఆమెను ఇంద్రాది దేవతలు తమకు ఇవ్వమని ఎంతయో అడిగిరి. ఇంతమంది అడుగుచున్ననూ గౌతముడు మాత్రము తనకిచ్చి వివాహము చేయమని అడుగలేదు.

ఇంతలో బ్రహ్మ ఒక ఉపాయమును ఆలోచించి ఎవరైతే భూమిని ప్రదక్షిణము చేసి ముందుగ తనవద్దకు వచ్చెదరో వారికి అహల్యను ఇచ్చి వివాహము చేసెదనని చెప్పెను. ఆ మాటలను విన్న ఇంద్రాది దేవతలు, మహర్షులు భూప్రదిక్షిణమునకు బయలుదేరిరి. కాని గౌతమమహర్షి మాత్రము శృతివాక్య ప్రమాణమైన ఒక మాటను జ్ఞప్తియందుంచుకొని ఉత్తమ గోమాతకు ప్రదక్షిణము చేసినచో అది భూప్రదక్షిణము అగునని ఈ పవిత్రమైన ఆలోచనతో ఒక పర్యాయము గోవునకు ప్రదక్షిణము చేసి బ్రహ్మదగ్గరకు వెళ్ళి విన్నవించెను.

బ్రహ్మ గౌతముడు చేసిన ఉత్తమగోమాత ప్రదక్షిణము భూమాత ప్రదక్షిణమని తలంచి, ఇది సత్యమే అని తలంచి మిగిలిన ఇంద్రాది దేవతలు, ఇతర మహర్షులు వచ్చులోపల వారిద్దరికి వైభవముగ వివాహము జరిపించెను. అటుపై ఇంద్రాది దేవతలు వచ్చి గౌతముని మాహాత్మ్యమునకు మెచ్చుకొని చేయునది లేక అసూయపరులైనప్పటికి వారిరువురి దంపతులను అభినందించి వెడలి పోయిరి[1].

## 2. గౌతమమహర్షి క్షామ సమయమున ప్రజా సంరక్షణమును చేయుట

ఒకానొక సమయమున గౌతమమహర్షి అహల్యా సహితుడై దండకారణ్యమున బ్రహ్మదేవుని గురించి తపస్సు చేసెను. అంత బ్రహ్మ ప్రత్యక్షమై గౌతముని నీకు కావలసిన కోరికను కోరుకొనమని పలికెను. అంత గౌతముడు "ఓ బ్రహ్మదేవా! నేను విత్తిన సస్యము ఒక జాములోనే (3 గంటలు) పరిపాకము పొందునట్లు వరము ఒసగుమని" పలికెను. బ్రహ్మ అట్లే అని దీవించి వెళ్ళెను.

అటుపై గౌతమ మహర్షి అహల్యాసహితుడై శతశృంగి పర్వతమునకు వెళ్ళి అక్కడ ఒక పర్ణశాలను నిర్మించుకొని బ్రహ్మదేవుని వరమహాత్మ్యమున

1. ఈ విషయము బ్రహ్మాండ పురాణమున కలదు.

తన ఆశ్రమమునకు వచ్చిన అతిథులందరికి రుచికరమైన భోజనాదులను అన్నదానమును చేయుచూ సంతసముగ నుండెను.

అహల్యయు పతియొక్క సేవయందు ఎక్కువ శ్రద్ధా భక్తులతో కాలము గడుపుచుండెను. గౌతమమహర్షికూడ సంతసముగనుండెను. ఇట్లుండగ ఒకానొక సమయమున గొప్ప కరువుకాటకములు వ్యాపించెను. ఒక్క గౌతమ ఆశ్రమ భూములు తప్ప, ఇతర భూములయందు పంటలు నశించెను. జనులు ఆకలి బాధలు కలిగినవారై చనిపోవుచుండిరి. ఇట్లుండగ అనేకమంది ఋషులు, బ్రాహ్మణులు గౌతమునకు అతిథులుగ శతశృంగగిరి వద్దకు వచ్చి అతని అతిథి సత్కారములను పొందుచుండిరి. గౌతమమహర్షి కూడా తనకున్నంతలో సకల విధములైన సౌకర్యములను చేయు చుండెను. ఈ వార్త తెలిసిన ఇతరులు కూడ వచ్చినందువలన గౌతమమహర్షి ఆశ్రమము వేల జనముతో నిండిపోయినది. గౌతముని కీర్తి ఇంద్ర లోకము వరకు పారెను. ఇంద్రుడు, నారదుడు మొదలైన వారు గౌతముని ఆశ్రమములో జరిగెడి అన్నదానాదులను చూచి పొగడు చుండిరి. ఇట్లుండగ పార్వతి కుమారుడగు విఘ్నేశ్వరుడు గౌతముని ప్రతిజ్ఞను భంగముచేయు ఉద్దేశ్యముతో బ్రాహ్మణరూప ధారియై వచ్చి వారిని పరీక్షింప కోరి ఆ ఆశ్రమమునందే అతిథి సత్కారములను పొందుచూ కాలము గడుపుచుండెను.

ఇలా ఉండగా గౌతముని యొక్క ఆశ్రమము భూలోక స్వర్గమై జనసందోహముతో గూడియుండెను. అహల్య గౌతములిద్దరును వచ్చిన అతిథులకు అతిథిసత్కారములు చేయుచూ కాలము గడుపుచుండిరి. ఇంతలో బ్రాహ్మణవేషధారియై వచ్చిన విఘ్నేశ్వరుడు తన తల్లికిచ్చిన మాటప్రకారము శివుని ఝటాఝూటమునందుగల గంగను భూమిపైకి పంపిన సవితి బాధ ఉండదని తలంచి దీనికి గౌతమమహర్షి ఒక్కడే సమర్థుడని గౌతముని ఆ పనికై వినియోగింప ప్రయత్నించెను.

ఇలా ఉండగా విఘ్నేశ్వరుడు తనతో అనేకమంది బ్రాహ్మణులను జతకూర్చుకొని గౌతముని ఆశ్రమమున వదలిపోవ ప్రయత్నించెను. ఆ విషయము తెలిసిన గౌతమమహర్షి వారినందరిని తన ఆశ్రమముననే ఉండవలెనని మిగుల ప్రార్థించెను. అంత మాయ బ్రాహ్మణుడైన వినాయకుడు గౌతమమహర్షికి పరీక్షపెట్ట ఇది సరియైన సమయమని తలంచి ఇలా చేసెను. పార్వతి చెలికత్తెను ఒకామెను పిలిచి మాయగోవుగా మారి గౌతముని పొలములో మేయమనియు గౌతముడు ఏమి చేసినను చనిపొమ్మనియు చెప్పెను. ఆ చెలికత్తె ఆ విధముగ మాయగోవై గౌతముని పొలములో మేయుచుండెను. వెంటనే గౌతముడు దానిని చూసి ఒక గరికెను విసరగ అది చనిపోయెను. వెంటనే అతనిపై అసూయగ్రస్థులగు బ్రాహ్మణులందరు ఏకమై గౌతముడు గోహత్యాపాతకుడని నిందించిరి. మాయాబ్రాహ్మణుని రూపములో నున్న గణపతియు అతనిని నిందించి బ్రాహ్మణులతో కూడి ఆశ్రమమును వీడ ప్రయత్నించెను. అహల్యయొక్క గొప్పతనమును చూచి అసూయపరులైన కొందరు స్త్రీలు తమకు ఇదియే సమయమని తలంచి అహల్య గౌతములను నిందించిరి.

పై విషయములను మనము పరిశీలించినచో ఈ గౌతమ మహర్షి యొక్క ఇతివృత్తమున గోప్రదక్షిణమును చేసిన భూప్రదక్షిణ పుణ్యము లభించునని తెలియుచున్నది. గోవు కడుపున 33 కోట్ల దేవతలుందురని, తోకయందు లక్ష్మియును, కొమ్ములయందు సూర్యచంద్రులును ఉందురని తెలియుచున్నది. మనకు పంచమహాపాతకములు కలవు. 1. గోహత్య 2. శిశు హత్య 3. స్త్రీ హత్య 4. బ్రాహ్మణ హత్య 5. ఆత్మహత్య. ఈ ఐందిటికి పంచమహా పాతకములని పేరు. కావున అసూయా గ్రస్థులైన బ్రాహ్మణులు ఇతనిని గోహత్యపాతకుడని నిందించిరి.కాని దేవతలు ఏది చేసినను మహర్షులు ఏది చేసినను అది ప్రజలకు మంచిదే అగునట్లుగ ఈ వినాయకుడు తల్లియగు పార్వతికి ఇచ్చిన మాట ప్రకారము గంగను తన

తల్లి సవతి పోరునుండి దూరము చేయు ఉద్దేశ్యముతో ఒక మంచి పనిగ గోదావరి నదీమాత ఈ త్ర్యంబక క్షేత్ర సమీపమున ప్రజల క్షేమమై ఉద యించుటకు కారణ భూతమైన దనియు పై ఋషుల చరిత్రలు అనెడి ఈ కథా ఇతివృత్తములో మనము తెలుసుకొనవచ్చును.

### 3. గౌతముడు అసూయపడిన బ్రాహ్మణులను శపించుట

అహల్య గౌతములు తమకు కలిగిన ప్రమాదమునకు మిక్కిలి చింతించి ఈ పాప విముక్తిని పొందుటకు మాకు దారి చూపుడు అని బతిమాలుకొనిరి. అంత విఘ్నేశ్వరుడు గౌతమునితో "ఓ ఋషివరా! నీవు శివుని గురించి తపము చేసి అతనిని మెప్పించి అతని జటాజూటమున గల గంగాభవానిని ఇచట ప్రవహింపచేయుము. దీని వలన ఈ పాపము నశించుటయేగాక, నీకు మూడులోకములయందును పూజార్హము కలుగును" అని చెప్పి వెళ్ళిపోయెను.

బ్రాహ్మణులు క్షామము కలుగుటచే గౌతముని నిందించి అచ్చట నుండి వెడలిపోయిరి. అంత గౌతముడు దీనికి మూలకారణమేమి అని యోగదృష్టితో చూడగ ఇది అంతయు విఘ్నేశ్వరుడు పన్నిన వ్యూహమనియు అలాగే బ్రాహ్మణుల అసూయ ద్వేషములనియూ తెలిసెను. అటుపై గౌతమమహర్షి విఘ్నేశ్వరుని దేవకార్యము సిద్ధింప చేయుటయే తన విధి అని నిశ్చయించుకొనెను. కాని తన్ను చూసి అసూయపడిన బ్రాహ్మణులను తనను నిందించిన కారణమున వారిని పాషండులు కమ్మని శపించెను. అటుపై ఈ విషయము గుర్తించిన బ్రాహ్మణులు భయపడి శరణు జొచ్చిరి. అంత వారికి శాపవిముక్తిగ గౌతముడు ఒక సూచన చేసెను. మీరు శ్రీకృష్ణుడు జన్మించిన పిమ్మట అతని వలన ముక్తిని పొందెదరని శాప విమోచనమును ఇచ్చెను[1].

1. ఈ వృత్తాంతము శివపురాణాంతర్గత జ్ఞాన సంహిత యందు కలదు.

### 4. గౌతమమహర్షి గంగను భూమికి తెచ్చుట

గౌతముడు వెంటనే అహల్యతో కూడి తపస్సు చేసుకొనుటకై హిమవత్పర్వతమునకు వెళ్ళెను. అచ్చట అందమైన ఆశ్రమమును అనేక గోవులు, దూడలు కలిగి మంచి పాడిఆవులతో కూడి ఎల్లప్పుడు పాలు భూమిపై జారవిడుచునటువంటి తెల్లనికాంతులు కలిగిన భూమిని, తెల్లటి రంగు కలిగిన పారిజాతపువృక్షములతో కూడిన ప్రకాశవంతమైన చింతామణి వంటి స్థలమున ధవళ స్వరూపుడైన ఈశ్వరుని గురించి ఒంటి పాదమున నిలబడి గౌతముడు తపస్సు చేయుచుండెను.

అంత గౌతముని తపస్సుకు మెచ్చి శివుడు గౌతమునికి ప్రత్యక్ష మయ్యెను. గౌతమమహర్షి శివుని అనేక విధముల స్తోత్రము కావించి గంగాదేవిని భూలోకమునకు పంపమని వేడుకొనెను. అందులకు శివుడు అనుగ్రహించెను. అటుపై గంగాదేవి గౌతముని కోరికపై భూతలమునకు వచ్చి మాయాగోవు చనిపోయిన చోట ప్రవహించి గోవును బ్రతికించి భూమిని పవిత్రము చేసెను. ఇంతలో ఏ బ్రాహ్మణులైతే గౌతముని నిందించిరో, ఆ బ్రాహ్మణులు కూడ గంగా జలమున స్నానము చేసి తరింపవచ్చిరి. కాని ఇచ్చట ఒక ఆశ్చర్యకరమైన దృశ్యము జరిగెను. ఎప్పుడైతే గౌతముని నిందించిన బ్రాహ్మణులు తనలో స్నానముచేయుటకు వచ్చిరో వెంటనే గంగాదేవి తన రూపమును ఉపసంహరించుకొని అదృశ్యమయ్యెను. గౌతముడు ఎంతగను ప్రార్థించినను గంగాదేవి అంగీకరింపలేదు. దీనికి కారణం ఎవరైతే తనను నిందించిన బ్రాహ్మణులు స్నానము చేయుటకు వచ్చిరో వారి మహాపాపములను తాను భరింపజాలనని చెప్పెను. అంత గౌతముడు అనేక విధముల ప్రార్థించి బ్రాహ్మణులను క్షమించమనియు తిరిగి భూమిపై ప్రవహించమనియు అతివినయముగ ప్రార్థించగ, అతని కోరికను మన్నించి గంగ అనుగ్రహించి తిరిగి భూమిపై అవతరించెను.

అలా శాంతించిన గంగామాత గౌతముని మూలమున భూమికి రాబడుటచే 'గౌతమి' అనియు, గోవును బ్రతికించుటచే 'గోదావరి' అనియు పేరుతో ప్రకాశించుచున్నది. కావున పవిత్రమైన గోదావరి పుణ్య స్నానము ఎంత మహత్తరమైనదో కదా! ఈ గోదావరి పుట్టిన ప్రదేశమునకే 'నాసికా త్రయంబకమని' పేరు. నేడు ఇది మహారాష్ట్రలో జ్యోతిర్లింగములలో ఒకటైన త్రయంబకేశ్వరుని క్షేత్రముగ ప్రకాశించుచున్నది. అందుకే నదీ స్నానములలో

"గంగే చ యమునే చైవ గోదావరీ సరస్వతి ।
నర్మదా సింధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు" ॥

అని ఏడు పుణ్యనదులలో ఈ గోదావరి స్తుతికూడ ఎంతో ప్రావీణ్యతను పొందింది. అందువలననే పై క్షేత్రములన్నింటికి కూడా పుష్కరములు జరుగు సమయమున అతి పునీతముగ పితృదేవతలకు పిండప్రదానములును, మోక్షదాయకముగ స్నానాదులును గావించి పూజలను చేసెదరు. పుష్కరము అనగ పన్నెండు సంవత్సరములు. ఒక్కొక్క నది ఒక్కొక్క పుష్కరకాలమున ఆ నదీమ తల్లి ఎదలో పుష్కరుడు దాగి ఉంటాడని అప్పుడు ఎంతో పవిత్రమైన ఆ పుష్కరములు పన్నెండు రోజులు నదీమ తల్లి పూజలు అందుకొంటుం దని ఈ కాలము పవిత్రమైన కాలముగ భావించి భక్తులు తీర్థ స్నానములు చేసెదరు[1].

## 5. గౌతముడు అహల్యకు ఒసగిన సంతానము

ఇలా గోదావరినదీ మాత విఘ్నేశ్వరుని సూచన ప్రకారము శివునికై తపస్సు చేయగ శివుడు కరుణించి గంగామాతను భూలోకమునకు పంపగ గౌతమునికి గోహత్యదోషము వలన ఏర్పడిన పాపము పరిహారమయ్యెను. అంత అహల్యాగౌతములు ఆనందముతో ఆశ్రమవాతారణమున కాలము

1. ఇది వరాహపురాణమున, బ్రహ్మపురాణమున కలదు.

గడుపుచుండిరి. ఇలాంటి ఆదర్శదంపతులను చూచి పాతివ్రత్య శిరోమణి యైన అహల్యను మెచ్చుకొని ఇంద్రాదులు కూడ ఆమెను తలంచుట మానుకొనిరి.

ఇలా పతివ్రతా హృదయముతో అహల్యగౌతముల గృహస్థాశ్రమ జీవనము సాగుచుండగ గౌతముడు ఆ అహల్యయొక్క సేవలకు మెచ్చి గృహస్థాశ్రమ ధర్మములలో సంతానోత్పత్తి ఉత్తమ విధి కావున గౌతముడు అహల్యను పిలిచి వరము కోరుకొనమని పలికెను. అంత అహల్య తనకు కొడుకును కావలయునని కోరుకొనెను. గౌతముడు అంగీకరించెను. కొంతకాలమునకు ఆమె గర్భిణియై ఒక కుమారుని కనెను. అతని పేరే 'శతానందుడు'.అతడు పెరిగి పెద్దవాడై ఉపనయనాదులు గావించిన పిమ్మట తాను కూడా తపోజీవనమును ప్రారంభించి తల్లిదండ్రుల ఆజ్ఞగైకొని తపోదీక్షకై వెడలిపోయెను. ఇతనికి 'శరద్వంతుడు' అనియు పేరు కలదు. ఇతని వీర్యము నుండియే కాలక్రమమున కృపి, కృపాచార్యుడు జన్మించిరి. మరియొక పర్యాయము కామవాంఛ కలిగిన అహల్యను అనుగ్రహించగ గర్భమై 'అంజన' అను కూతురు పుట్టెను. ఈ అంజన పితృవాత్సల్యమునకు గురియై ఎల్లప్పుడు అహల్యకడనే ఉండెను. ఈమెకు వాయుదేవునికి ఈశ్వరుని వలన జనించినవాడే ఆంజనేయుడు. మరికొంతకాలమునకు గౌతముని కృపవలన అహల్య గర్భము ధరించి ఒక కుమార్తెను పొందెను. ఈ కుమార్తెనే గౌతముడు తన శిష్యుడగు ఉదంక మహామునికి నూతన దేహము, నవయవ్వనము ఒసగి అటు తరువాత వివాహము చేసెను[1].

### 6. గౌతముడు అహల్యా ఇంద్రులను శపించుట

అహల్య వివాహముయినప్పటి నుండియు ఇంద్రుడు ఆమె లోకాతీతమైన సౌందర్యమునకు వసుడై ఆమె పొందు కోరుకొను చుండెను.

1.ఈ ఇతివృత్తము భారత అశ్వమేధ పర్వమున కలదు.

కాని పతివ్రత శిరోమణి అగు అహల్య ఇంద్రుని చిత్తప్రవృత్తి తెలుసుకొని గౌతమమహర్షియొక్క కోపమనెడి అగ్నికి భయపడి యుండెను.

కాని ఒకనాడు ఇంద్రుడు తన కోరికను తీర్చుకొనకోరి ఒక ఉపాయము ఆలోచించి కోడి రూపమును కలవాడై గౌతముని ఆశ్రమమున చేరి నాటి నడిరేయి సమయమున కూయసాగెను. ఆ సమయముననే కోడికూత వినిన తరువాత గౌతమమహర్షి కాలకృత్య నిర్వహణమునకు నదీస్నానమునకై ఆశ్రమమును వీడి వెడలిపోయెను. గౌతమ మహర్షి వేషములో ఆశ్రమమున ఇంద్రుడు ప్రవేశించి అహల్యతోడి పొత్తును కోరెను. కాని ఆ సమయమున అహల్య కామోపహతుడైన వాడు తన భర్తయే అని సంభోగమునకు అంగీకరించెను. అంత వారు గాఢ సుఖమునందుండగ గౌతముడు ఇంకను చాలాపొద్దు కలదని ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. లోపల ప్రవేశింపగనే అహల్య ఆశ్చర్యపడి "మహాత్మా ! ఇంతవరకు నాతో ఉన్న నీవు రెండు రూపములు ఎట్లు పొందితివి?" అని ప్రశ్నించెను. ఆ సమయమున ఇంద్రుడు ఒణికిపోయి పిల్లియై బయటకు పోవ ప్రయత్నించెను. గౌతమమహర్షి ఆ పిల్లిని చూచి "ఓరి! త్వరలో నీ విషయమును (నీవెవరివో) చెప్పనిచో నీవు దగ్ధమైపోవుదువు" అని పలికెను.

ఆ మాటలను విన్న ఇంద్రుడు తన నిజ స్వరూపమును ధరించి క్షమించమని కాళ్ళపై పడెను. అహల్య ఆశ్చర్యపడి "మహాత్మా! ఈ మోసము నేనెరుగను. నీవు తిరిగి వచ్చి నా దేహ సౌఖ్యమును అపేక్షించితివని కోరికను తీర్చ ప్రయత్నించితిని. ఇంతకు మించి పంచభూతముల సాక్షిగ నాకే విషయము తెలియదని" పలికెను.అహల్య పలికిన మాటలకు తోడుగ వెంటనే ఆకాశవాణి 'అహల్య నిర్దోషి' అని పలికెను. కాని గౌతమమహర్షి ఆ మాటలను లెక్క చేయక అహల్యతో "నీవు తెలిసి చేసినను తెలియక చేసినను దోషము దోషమే. తెలియక నిప్పు తాకినను కాలక యుండునా!" అని "కావున నీవు చైతన్యహీనమైనశిలయై పడియుండుము" అని శపించెను.

ఇంద్రుని చూచి "దుర్మార్గా! దేవేంద్ర! నీవు శచీపతివి అయిననూ నీ కామ లాలసతో మితిమీరి ప్రయత్నించితివి. అగ్ని హోత్రమును అపహాస్యము చేయు తుంటరి మిడతతో సమానముగ అయితివి. ఓరి నీచా! మహా పతివ్రత అగు మహర్షి పత్నిని మోసగించి నీచమైన పనికి పాల్పడితివి. కావున నీ అండము ఊడి పోవుగాక! నీ శరీరమంతయు యోనిమయమై ఎల్లప్పుడూ దుఃఖము కలుగుగాక! నీ సామ్రాజ్యమును శత్రువులు అపహరింపగ పదవి భ్రష్టతనొంది దైన్య జీవనమును గడుపుదువు గాక! " అని శపించెను. ఆ మాటలను విన్న తరువాత ఆ ఇరువురును గౌతమమహర్షి పాదములపై పడి క్షమింపమని వేడుకొని శాప విముక్తిని కలిగించమని ప్రార్థించిరి.

అంత కొంతసేపటికి గౌతమ మహర్షి కోపమును ఉపసంహరించు కొని అహల్యను చూచి "పాపాత్మురాలా! నీవు శిలవై శీత వాత ఆతపములకు ఓర్చుకొని నిరాహారివై రాత్రింబవళ్ళు రామస్మరణ పూర్వకముగ వేల సంవత్సరములు తపింపుము. ఈ ఆశ్రమము ఇక జంతు రహితమై ఉండి పోవును. అనగా ప్రాణులెవరూ నివసించరు అని అర్థము. చివరికి శ్రీరామ చంద్రుని పాదముల దుమ్ము నీ శిరస్సుపై పడగ నీకు శాపవిముక్తి కలుగును. అటు తరువాత పవిత్రమైన దేహము కలదానివై నా వద్దకు రావచ్చును" అని పలికెను. అంత ఇంద్రుని చూచి "ఓ పాపాత్మా ! నీపైననూ నాకు కరుణ కల్గుచున్నది. మహర్షుల కోపము నీటిపై గీచిన గీతల వంటిది. నీ యోనులు ఇతరులకు కనబడకుండుగాక. అవి నేత్రములవలె పై వారికి తోచును. స్వర్గలోక సామ్రాజ్యమును వదలినను తిరిగి కొంత కాలమునకు స్వర్గప్రాప్తి కలుగును" అని కరుణించి గౌతముడు హిమగిరికి పోయి తపస్సు చేసుకొనుచుండెను. ఇంద్రుని అండము ఊడి క్రిందపడి దేహము ఎల్లప్పుడును యోనులు ఏర్పడగ పశ్చాత్తాపుడై వెడలిపోయెను. గౌతమమహర్షి శాపమున

ఇంద్రుడు పదవీచ్యుతుడై తిరిగి కొంతకాలమునకు స్వరాజ్యమును పొందెను. అహల్యయూ చిరకాలమునకు శ్రీరాముని పాదధూళి తగులగా స్త్రీ రూపమును పొంది పరమేశ్వర పాదస్పర్శచే పవిత్రమై గౌతమమహర్షిని సేవించుచూ మహాపతివ్రతయై వెలసెను[1].

## 7. గౌతముడు బ్రహ్మదత్తుని శపించుట

మహర్షి గౌతముడు ఒకనాడు బ్రహ్మదత్తుడను రాజు ఇంటికిపోయి ఆతిథ్యము ఇమ్మని అడిగెను. అతడు బ్రహ్మానందముతో గొప్పమునీంద్రుడైన గౌతముడు తన ఇంట ఉంచుకొని చిరకాలము అతనికి ఆతిథ్యమునిచ్చి పోషించుచుండెను.

ఇలా ఉండగా ఒకనాడు గౌతముని భోజన పదార్థములలో ఒక మాంసపుముక్క కనబడెను. వెంటనే గౌతముడు ఆ దోష పరిహారార్థమై బ్రహ్మదత్తుని గ్రద్దయై పుట్టమని శపించెను. కాని బ్రహ్మదత్తుడు తనకు తెలియని దోషమని దీనికి శాపవిముక్తి కల్గించమని ప్రార్థించెను. అంత గౌతముడు కరుణించి శ్రీరాముని హస్తము శోకగనే పూర్వరూపము కలుగునట్లు వరమిచ్చెను.అటుపై బ్రహ్మదత్తుడు గ్రద్దయై పుట్టి ఒకనాడు ఒక గుడ్లగూబతో పోరాడి శ్రీరాముని వద్దకు వచ్చి ఈ తగవు తీర్చమని ప్రార్థించెను. అంత శ్రీరాముడు తన పవిత్ర హస్తమున ఆ గ్రద్దను నిమరగ గౌతముని శాప విమోచనమును పొంది బ్రహ్మదత్తుడై వెడలిపోయెను[2].

## 8. గౌతమ ధర్మసూత్ర - స్మృతి- న్యాయ సంహితలు-

1. గౌతమ మహర్షి లోకమునకు ప్రసాదించిన మొదటిది గౌతమ ధర్మ సూత్రములు లేక గౌతమ స్మృతి.

---

1. ఈ వృత్తాంతము రామాయణమున మరియు పద్మపురాణమున కలదు.

2..ఈ విషయము ఉత్తరరామాయణమున కలదు.

2. న్యాయశాస్త్రమును ఖండింప చూచిన వ్యాసునిపై కోపించి గౌతముడు తన తపఃశక్తితో తన పాదమున నేత్రమును సృష్టించుకొని అతనిని చూచెను. నాటినుండి గౌతమ మహర్షికి 'అక్షపాదుడు' అని పేరు వచ్చినది. ఈ గౌతమ న్యాయశాస్త్రమే ప్రతిజ్ఞ, హేతు, ఉదాహరణ మొదలైన షోడశ పదార్థ నిరూపకమై పంచ అధ్యాయాత్మకమై యుండును. ఇక పోతే ఈ గౌతమ న్యాయశాస్త్ర పంచఅధ్యాయము లలోని విషయ సూచికలు వరుసగ ఇలా ఉన్నవి.

1. ప్రథమాధ్యాయము - ప్రథమాహ్నికమందు ప్రమాణాది పదార్థనవక లక్షణ నిరూపణము.

ద్వితీయాహ్నికమున వాదాది సప్త లక్షనిరూపణము కలవు.

2. ద్వితీయాధ్యాయ- ప్రథమ, ద్వితీయాహ్నికముల సంశయ పరీక్షణాదికము, అర్థాపత్త్యాద్యంతర్భావ నిరూపణము కలవు.
3. తృతీయాధ్యాయమున - శరీరేంద్రియార్థ బుద్ధిమనః పరీక్షణము
4. చతుర్థాధ్యాయమున - ప్రవృత్తి దోషాదికము, దోషనిమిత్తాదికము
5. పంచమధ్యాయమున - భేద, నిగ్రహస్థానబేధ నిరూపణము కలవు.

మూడవదగు గౌతమ సంహిత గొప్ప జ్యోతిషశాస్త్ర గ్రంథము. పై ఇతివృత్తమును బట్టి గౌతమమహర్షి చరిత్రలో సంగ్రహ పరిశీలన ఏమనగ

1. గౌతమమహర్షి శతపథ బ్రాహ్మణమును అనుసరించి బ్రహ్మ మానస పుత్రుడు. సప్తర్షులలో ప్రసిద్ధుడు.
2. వేదములకే శృతులని పేరు. శృతులననుసరించి గౌతమవంశమున జన్మించిన మహర్షి గౌతమధర్మ సూత్రకర్త.
3. బ్రహ్మ సృష్టిలో అత్యంత సౌందర్యమైన స్త్రీ గ అహల్యను సృష్టించెను. ఇంద్రాది దేవతలు అందరును కూడా ఆమెపై మోహపడుటకు కారణము

పూర్వము విష్ణుమూర్తి మోహినీ అవతారమును ధరించి శివుని సురాసురులందరిని కూడా మయమరిపించెను. అప్పుడు బ్రహ్మ సృష్టిని అందరు ఇంత సౌందర్యవతిని బ్రహ్మ సృష్టించలేదని వెంటనే మోహనాంగి యగు అహల్యను సృష్టించి నైష్టిక బ్రహ్మచారియగు గౌతమునకు పరిచారికగ నియమించెను. ఇచ్చట మరియొక విషయముకూడా మనము గమనించ వలెను. గోమాత యొక్క గొప్పతనము, శృతి వాక్య ప్రమాణ బుద్ధిలో "గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకాః సమస్తాః సుఖినో భవన్తు" అనునట్లుగ దేవతా స్వరూపమైన గోవును ప్రదక్షిణము చేసిన భూసమాన మైన ప్రదక్షిణము అని తెలుపుటకే అహల్యా గౌతమ వివాహ కథలో మనకు తెలియుచున్నది.

4. వినాయకుని ద్వారా తన తల్లియగు పార్వతికి తన సవతియగు గంగాభవాని దూరమగునట్లు గౌతముని గోహత్యాశాప విముక్తికై భూలోకమున గౌతమమహర్షి శివునికై తపస్సు చేసి గౌతమ లేదా గోదావరి నది నాసికా త్ర్యంబకమున పుట్టుటకు ఇతని చరిత్ర కారణమైనది.

5. గౌతమ, అహల్యలకు సంతానముగ శతానందుడు లేక శరద్వంతుడు కలిగెను. అలాగే అంజనాదేవి కూడా కుమార్తెగా జన్మించెను. శతానందుడికి కృపి, కృపాచార్యుడు జన్మించగా అంజనకు వాయుదేవుని వలన ఆంజనేయుడు జన్మించెను. అలాగే అహల్య రెండవ కుమార్తెను గౌతముడు తన శిష్యుడగు ఉదంక మహాముని నూతన దేహము, నవ యౌవనము కలిగిన తరువాత ఇచ్చి వివాహము చేసెను.

6. ముఖ్యముగ త్రేతాయుగమున మహావిష్ణువైన శ్రీరాముడు అహల్యాశాప విమోచనమునకు కారణభూతు డగుటకు అహల్యా, ఇంద్రులకు శాప మిచ్చిన గౌతమ మహర్షియొక్క ఇతివృత్తము మరియు బ్రహ్మదత్తుడను రాజు గౌతమునకు ఆతిథ్యమును ఇచ్చుటలో మాంసపు ముక్క కనబడగ

గౌతముడు గ్రద్దయై పుట్టుమని శపించి చివరకు శ్రీమహావిష్ణువైన శ్రీరాముని హస్తము శోకగనే అతనికి పూర్వ రూపము వచ్చుననెడి బ్రహ్మదత్తశాపవిముక్తి కారణమైన గౌతమమహర్షి ఇతివృత్తములో మనకు తెలియునది ఏమనగ మహావిష్ణువుని అవతార పురుషుడైన శ్రీరాముని మహిమలో రాముని కాలి ధూళి సోకి రాయిగ ఉన్న అహల్య స్త్రీవలె మారుట, గ్రద్దగ ఉన్న బ్రహ్మదత్తుడు శ్రీరాముని హస్తముతో రాజుగ మారి రామాయణములో జరిగిన ఈ ఇతివృత్తము నకు గౌతమ మహర్షి ఇతివృత్తము కారణమై ఉన్నది. త్రేతాయుగమున గౌతమ మహర్షి ఇతివృత్తము ఋషుల చరిత్రలో ప్రాధాన్యతను సంతరించుకున్నది.

7. అలాగే గౌతమమహర్షి ధర్మసూత్రములు, గౌతమ స్మృతి, న్యాయ శాస్త్రములను ఖండింప చూసిన వ్యాసునిపై కోపించి తన పాదమున నేత్రము సృష్టించుకొని అక్షపాదుడగుట, అలాగే పంచ అధ్యాయములైన గౌతమన్యాయశాస్త్రము, గొప్ప జ్యోతిష గ్రంథమైన గౌతమసంహిత మొదలగు విషయములన్నియు మనము పరిశీలన గావించినచో ఋషుల చరిత్రలోని విభాగమైన ఈ గౌతమమహర్షి సంగ్రహ పరిశీలనలో సూక్ష్మముగ ఆలోచించిన సామాన్యపాఠకులకు అవగతమగు చున్నవి.

## గౌతమమహర్షి స్తుతి

"గౌతమ మహర్షే!సప్తఋషి వర్యా!బ్రహ్మమానస పుత్రా!అహల్యా పతే!
గోదావరీ నదీ ప్రవాహ గోహత్యా పాప నివారక శివ తపశ్శాలీ!
గౌతమీ నదీతట త్ర్యంబకేశ్వర వాసా! బ్రాహ్మణ పోషకా! దయానిధే!
గౌతమాహల్య సంతాన ఫల శతానంద, అంజన పితా! నమస్తే నమః"

❖ ❖ ❖

# 2. చ్యవనమహర్షి

## 1. చ్యవనమహర్షి జన్మించి పులోముని భస్మము చేయుట

పులోమ భృగుమహర్షి ఇద్దరును దంపతులు. వారి పూర్వ చరిత్ర మనకు ఇలా తెలియు చున్నది. భృగు మహర్షి ఒకానొక రోజున అగ్ని హోత్రమును సిద్ధము చేయమని పులోమతో చెప్పి స్నానమునకై పోయెను. పులోమ అగ్ని రగిల్చి జ్వాలగ అగ్నిని ప్రకాశింపచేసెను.

ఇంతలో పులోముడను రాక్షసుడొకడు చిరకాలమునుండి పులోమను ప్రేమించి ఆమెను వివాహమాడుదునని చెప్పుచుండెను. కాని ఆమె తల్లిదండ్రులు అతనికివ్వకుండ భృగుమహర్షికి ఇచ్చి వివాహము చేసెను. నాటినుండి కామోద్రేకపరుడైన పులోముడు ఆమెను అపహరింప ఎన్నో పన్నాగములు పన్నుచుండెను. ఒకనాడు భృగుమహర్షిలేని సమయములో అమెఉన్న అగ్నిగృహమునకు ప్రవేశించెను. 'ఆమె పులోమ అగునా, కాదా!' అను సంశయముతో అగ్ని హోత్రుని "ఆమె ఎవరు?" అని అడిగెను.

అంత అగ్నిదేవుడు రెండు విషయములను ఆలోచించెను. నిజము చెప్పినచో విప్రశాపము కల్గును. చెప్పనిచో అసత్యదోషము కలుగును. అగ్నిదేవుడు ఆలోచించి బ్రాహ్మణశాపము వచ్చినను వచ్చుగాక అసత్య దోషము తీర్పరాదని నిశ్చయించుకొని అగ్నిదేవుడు భృగుపత్ని అని పలికెను. ఇక్కడ మనము ఆలోచించినచో 'సత్యం వద ధర్మంచర' సత్యమును పలుకవలెనని, ధర్మమును ఆచరించ వలెనని అన్నట్లు భారతంలో దుష్యంత శకుంతలో పాఖ్యానములో, ఆది పర్వములో సత్యముయొక్క విలువను గూర్చి ఇలా చెప్పబడింది. అచ్చటి పద్యములోని భావమేమనగ -

'నుత జల పూరితంబులగు నూతులు నూరింటికంటె' అను పద్యములో నీరు త్రాగుటకు అనువైన నూరు చేద బావులకంటె ఒక దిగుడు బావి మేలు, అటువంటి నూరు దిగుడు బావులకంటె ఒక యజ్ఞము మేలు, అటువంటి నూరు యజ్ఞములకంటె ఒక కుమారుడు మేలు, అటువంటి నూరు కుమారులకంటె ఆలోచించి చూడగ ఒక సత్యమైన వాక్యము పలుకుట మంచిదని చెప్పబడినది. దీనిని బట్టి సత్యముయొక్క విలువ అష్టదిక్పాలకులలో ఒకడైన అగ్నిదేవుని ద్వారా చెప్పుటవలన సత్యము నిప్పుతో సమానమని తెలియుచున్నది.

అంత అగ్నిదేవుని ద్వారా విషయమును తెలుసుకొన్న పులోముడు వెంటనే వరాహరూపమును ధరించి ఆమెను ఎత్తుకొని పోవ చూచెను. అప్పుడు ఆమె గర్భము పగిలిపోగ(చ్యుతము) అందుండి ఒక శిశువు బయటబడెను. అతనికి తల్లియగు పులోమగర్భమునుండి జారిపడుటచే (చ్యుతుడగుటచే) నాటి నుండి 'చ్యవనుడు' అను పేరు వచ్చెను. ఆ బాలుని యొక్క తేజస్సును చూచిన మాత్రముచే పులోముడు భస్మీ భూతుడయ్యెను. అంత పులోమ సంతసమున ఆ బాలుని ఎత్తుకొని గృహమునకు వచ్చెను. భృగుమహర్షియు ఆశ్రమప్రాంతమునందు నదిలో స్నానాదులను గావించుకొని ఇంటికివచ్చెను. పులోమ జరిగిన దంతయు తన భర్తకు చెప్పి, ఆ బాలుని చూపెను.

అంత భృగుమహర్షి తన భార్యను ఆ రాక్షసునకు తెలిపిన అగ్నిపై కోపించి అతనిని 'సర్వభక్షకుడు గాక!' అని శపించెను. అటుపై అగ్నిహోత్రుడు ఇది విని కోపించి తన తేజస్సును ఉప సంహరించుకొనెను. బ్రహ్మాదులు అతని శాపమునకు కొంత ఉప శమనము కల్గించునట్లుగ "భృగుశాపము అమోఘమనియు అయినను సర్వభక్షకుడగు అని భృగువు శాపమిచ్చినప్పటికి అతడు శుచులలో అత్యంత శుచుడని, పాత్రులలో

పరమపాత్రుడని, పూజ్యులలో పరమ పూజ్యుడని, వేదచోదిత విధానముల అనగ ఋత్విజులు హోమములు, యజ్ఞములు, యాగములు చేయు నపుడు ఆ వేద మంత్రములలోని ఫలితములుగ యజ్ఞగుండము లలో వేసే ఘృతము స్వాహాదేవి ద్వారా తనగుండానే వారికి చేర్చునట్లుగ లోకము లను నడిపెదవని" బ్రహ్మాదులు అతనికి వరములు అనుగ్రహించి అగ్ని యొక్క కోపమును నివృత్తింప చేసి శాంతింప చేసిరి[1].

## 2. చ్యవనుని తపోనిరతి

పులోమ కుమారుడైన చ్యవనుడు తల్లిపాలను త్రాగి పెరిగి పెద్దవాడగుచుండెను. భృగుమహర్షి కాలక్రమేణ అతనికి చేయవలసిన ఉపనయనాది సంస్కారములు కావించి బ్రాహ్మణ ప్రధాన వృత్తియు, జీవిత పరమావధిని సిద్ధింపచేసెడి తపోదీక్షకు ఆశ్రమవాసమున పురికొల్పగ తల్లిదండ్రుల ఆశీర్వాదములను పొంది వనాంతరములలో అందులోను వైదూర్యపర్వత ప్రాంతమునగల ఒక సరోవరముచెంత గొప్పతపోనిష్టలో మునిగిన వాడై కొన్నివేల సంవత్సరములు తపస్సు చేసెను. ఇలా అనేక సంవత్సరములు ధ్యాన, ధారణ, సమాధి, లయావస్థలో మనస్సును కేవలం పరమేశ్వరుని పైనే లగ్నము చేసి దివ్యానందమును అనుభవించుచుండగ అతని దేహము పుట్టలు పట్టెను. ఆ పుట్టపై తీగలు, చిన్నచిన్న పొదలు మొలచి భూమిని ఆక్రమించుకొనుచుండెను. ఇంత జరిగినను ఆ చ్యవనునికి దేహశుద్ధి లేకుండెను.ఇక్కడ మనకు వాల్మీకి మహర్షియొక్క ఇతివృత్తము గుర్తుకు వస్తున్నది. బోయవాడై, కర్కశకాయుడై దారిలో పోవువారిని వెంబడించి వారివద్ద ఉన్నవి దోచుకొనెడి ఈ బోయవాడు ఒకానొక రోజున సప్తర్షులు తాము ఉన్న వనప్రాంతములో పోవుచుండగ వారిపైకి ఉరికి వారిని హింసింప పూనగ అప్పుడు సప్తర్షులు ఒక పరీక్ష పెట్టిరి.

---

1. మనకు ఈ ఇతివృత్తము భారత ఆదిపర్వమున కలదు.

"ఓ శబర! నీవు దారిలో పోవు వారిని క్రూరత్వముగ ఇక్కడ దోచుకున్న వస్తువులను నీ భార్యాబిడ్డలకు అందజేయుటలో గొప్ప పాపము సంభవించుచున్నది. కావున నీవు నీ ఇంటికి వెళ్ళి మేమడిగిన ప్రశ్నకు సమాధానమును తెలుసుకొని రమ్ము. నీవు వచ్చునంతవరకు ఇచ్చటనే ఉందు"మని సప్తర్షులు పలికిరి. అంత ఆవేశపడిన ఆ బోయవాడు మీ సందేహమేమిటో చెప్పుడు దానిని నేను నివృత్తి చేసెదను అని పలికెను. అప్పుడు సప్తర్షులు "ఓ శబర! దారిలో పోవు వారిని హింసించుట వలన వచ్చెడి పాపఫలితముల నీతో పాటు మీ ఇంటిలో వారుకూడ పంచు కొందురా" అని ఒకసారి ఇంటికివెళ్ళి తెలుసుకొని రమ్మని పంపించెను.

అటుపై బోయవాడు పరుగుపరుగున ఇంటికి వెళ్ళి భార్యాబిడ్డల వద్ద ఈ విషయమును ప్రస్తావించెను. అప్పుడు అందరు మూకుమ్మడిగ "ఇంటియజమానివైన నీవు కుటుంబము పోషించ వలసిన బాధ్యత నీది. నీవు దారి దోపిడి చేసి తెచ్చెదవో కష్టించి సంపాదించెదవో మాకు తెలియదు. నీవు చేసిన పాపకార్యములకు ఎలాంటి సంబంధము లేదని" బదులు చెప్పిరి. ఆ మాటలు విన్న బోయవాడు వెంటనే మనస్సులో ఒక మార్పును పొంది సప్తర్షుల వద్దకు వచ్చి జరిగిన ఇతివృత్తమును తెలిపెను. అంత వారు "చూచితివా! ఎవరికోసమైతే హింసా ప్రవృత్తితో ఈ పాపకార్యమును చేయుచున్నావో వారే ఇందుకు భిన్నముగ ప్రవర్తించినచో నీవు కష్టించి ఫలితమేమి" అని నీవు చేరుకొవలసిన స్థితి ఇదికాదు. భగవంతునివైపు నీ మనస్సును మరల్చుకొని మేము చేసెడి మంత్రోపదేశమును విని పునరావృత్తముగ (మరల మరల) ఆ మంత్రమునే జపించుచుండుము. మేము తీర్థ యాత్రలకు వెళ్ళి తిరిగి వచ్చునంతవరకు ఈ మంత్రమునే జపించుము అని పలికి సప్తర్షులు "మరామరా" అని మంత్రము చెప్పి వెడలిపోయెను. అంత ఆ బోయవాడు సప్తర్షులు చెప్పిన ఆ మంత్రముపైనే మనస్సును లగ్నము చేసి ఆ నామ జపముచేసి తపోదీక్షగ సలుపుట చేత

అతడు ఒడలు మరచినవాడై జపించుచుండగ ఈ చ్యవనమహర్షి వలె తన చుట్టూ పుట్టలు లేచెను. కావున వాల్మీకము అనగ 'పుట్ట' వాల్మీకుడునగ పుట్టలోనించి వచ్చినవాడని అర్థము. ఇలా రామనామ జప నిష్ఠాగరిష్ఠుడై ఆదికావ్యమైన రామాయణము అను ఇతిహాసమునకు కారణభూతు డయ్యెను. రామ అనగ 'నమో నారాయణాయ' అనే అష్టాక్షరములలో ఒకటైన 'ర', అలాగే 'ఓం నమశివాయ' అనే పంచాక్షరిలోని మ ను కలుపగ 'రామ' అయినది. అనగ రామ శబ్దము 'రమయతీతి రామః' అందము కూర్చునని అర్థము. అలాగే శివ కేశవ అభేదముగను చెప్పవచ్చును.

### 3. చ్యవనుడు సుకన్యను వివాహమాడుట

సంయాతి అను ఒక రాజుచే చతుస్సహస్రదేవీ సమూహము తోడను, సుకన్య అను కూతురి తోడను, సైన్య సమేతుడై సరోవరమున జలక్రీడార్థమై వచ్చి ఆనందముగ గడుపసాగెను. సంయాతి కుమార్తెయగు 'సుకన్య' తన స్నేహిత పరివారముతో పుట్టలతో పరివేష్టితుడైన చ్యవనుని వద్దకు వచ్చెను. ఆ సమయమున పుట్టలోనున్న చ్యవనుని నేత్రములు ఖద్యోత ద్యుతులవలె ప్రకాశించుట చూచి ఆ కన్నులను పొడిచెను. వెంటనే అది గుర్తించిన చ్యవనుడు అక్కడికి వచ్చిన సంయాతి సైన్యమునకు తన తపో శక్తిచే మూత్రపురీషనిరోధము గావించెను. అటుపై రాజు అయిన సంయాతి దానికి కారణము తెలుసుకొనలేక భయపడు చుండెను. అటుపై సుకన్య తండ్రివద్దకు వచ్చి తానొక పుట్టలో రెండు మినుగురులను చూచి పొడచిన సంగతిని తెలిపెను. అంత సంయాతి ఆ ప్రదేశమునకు వెళ్ళి అక్కడ తపస్సు చేయుచున్న కృశించిన ఎముకలతో కూడిన శరీరముతో కల మిక్కిలి ముసలివాడగు చ్యవనుని చూచి అతని పాదములపై పడి శరణుజొచ్చి తన కూతురి అపరాధమును మన్నింపమని వేడుకొనెను. అంత చ్యవనమహర్షి అంతయు గుర్తించి సుకన్యను తనకిచ్చి వివాహము

చేసినచో క్షమింతునని పలికెను. సంయాతి అంగీకరించి తన కూతురుని అడుగగ అందులకు సమాధానముగ సుకన్య "తండ్రీ! ఇంతకన్న నాకు కావలసినది ఏమున్నది. పరమ తపోధనుడగు బ్రహ్మర్షిని భర్తగ పొందు భాగ్యము మన వంశమును పవిత్రము చేసి నా పుట్టుకను పరమార్థము చేయును. కావున నేను తప్పక ఆ మహర్షిని వివాహ మాడెదనని" తన సమ్మతిని తెలియజేసెను.

అటుపై బ్రహ్మర్షికి తన కూతురునిచ్చి పరిణయము చేసి తన సైన్యమునకు వచ్చిన ఆపదను తొలగించుకొని, సుకన్యను చ్యవనునికి అప్పగించి తన నగరమునకు వెళ్ళెను. ఇలా ఉండగ సుకన్య తనకు ఋషి శ్రేష్ఠుడగు చ్యవనుని సేవా భాగ్యము లభించినదని మహోత్సాహముతో పరిచర్య చేయుచుండెను. తాను యువతి అయినను సుకన్య వయోవృద్ధుడు, జీర్ణాంగుడు అయిన భర్తయే పరమదైవమని ఆతనిని ఆరాధించుచుండెను. ఆ విధముగ భర్త అనుగ్రహమును ఆత్మానందమును పొందుతు తుచ్ఛదేహ వాంఛితమగు కామ్యసుఖములను అభిలషించక ఇంద్రియ నిగ్రహముతో అతని సేవే తనకు పవిత్ర జీవితముగ భావించి కాలము గడుపుచుండెను.

**4. చ్యవనుడు నవయువ్వనుడగుట**

ఈ విధముగ చ్యవనుని సపర్యలు చేయుచున్న సుకన్యను గూర్చి అశ్వినీదేవతలు విని ఆశ్చర్యమునుపొంది చ్యవనుని ఆశ్రమమునకు వచ్చి ఒంటరిగ ఉన్న సుకన్యను చూచి ఆమె నామధేయాదులను అడిగి తెలుసుకొనిరి. అంత సుకన్య తాను సంయాతి కూతురుననియు, చ్యవన మహర్షి భార్యననియు చెప్పెను. అంతవారు ఆమె సౌందర్య లావణ్యములను చూచి "ఓ కాంత! నీవు త్రిలోక సుందరివైయుండి ఇట్టి ముసలివానిని వివాహము చేసుకొనుటచే నీ శరీరమునకు కామ సుఖానందము కలుగు చున్నదా? కావున నీ సౌందర్యము 'అడవి కాచిన వెన్నెలగ' కానీయక

సౌందర్యవంతుడైన ఒక నవ యవ్వనుడను వివాహమాడుము. మేము తీసుకొని వచ్చెదమని" పలికిరి.

అంత అశ్వినీదేవతలు పలికిన మాటలువిన్న సుకన్య "ఓ మహాత్ములారా! మీరు నాయందు కలిగిన ఈ భావమును గూర్చి తెలియ జాలకున్నాను. పరమ పవిత్రమైన నా పతి పాదసేవ చేయుటకు వానికి తగిన భక్తిశ్రద్ధలు కనబరచుటకు మీరు సమర్ధవంతులైనచో మీరు చెప్పినట్లే చేయుదును. లేనిచో మీ దారిన మీరు పోవచ్చును. అనవసరముగ నన్ను ఇబ్బందిపెట్టక ఇచటనుండి వెళ్ళండి" అని చెప్పెను.అంత సుకన్య తన భర్తయగు చ్యవనమహర్షి దగ్గరికి వెళ్ళి వారు చెప్పిన విషయములను చెప్పెను. అటుపై చ్యవనుడు వారు చెప్పినట్లే చెయ్యమని ఆమోదించెను. భర్త ఆజ్ఞనుపొంది అందలి అంతరార్థమును గ్రహించి వెంటనే సుకన్య అశ్వినీదేవతల వద్దకు వెళ్ళి తనకు ఒక నవయవ్వనాన్ని తీసుకొని రమ్మని కోరుకొనెను. అటుపై వారు బ్రహ్మానందమును పొంది సమీపమునగల కొలనులో దిగుసరికి నవయవ్వనులు అయ్యిరి. చ్యవనుడు కూడ ఆ దృశ్యమును చూచి తానుకూడ ఆ కొలనుయందు దిగగ చ్యవనుడు నవ యవ్వనుడై వారితోపాటు పాటు తిరిగివచ్చెను.

అటుపై సుకన్య తన యొక్క మహా పాతివ్రత్య మహిమచే 'సమానరూప వయోవిలాసముల నొప్పుచున్న ఆ ముగ్గురిలో చ్యవనునే వరించెను'. ఆ దృశ్యమును చూచిన అశ్వినులు ఇరువురు ఆమె పాతివ్రత్యమునకు అభినందించి ఆమెను పరీక్షించుటకే అట్లు చేసితిమని చెప్పిరి[1]. సుకన్య తనకు ఋషిశ్రేష్ఠుడగు చ్యవనుని సేవాభావనను గుర్తించినదే కాని తుచ్ఛమైన ఐహిక సుఖమును వాంఛించలేదు. తాను సౌందర్యవతి అయినప్పటికి వృద్ధుడైన అవయవములు కృశించిన తన

1.ఈ ఇతివృత్తము మనకు ఆధారపూర్వకముగా భారతమున, దేవీభాగవతమున కలవు.

భర్తయైన చ్యవనుని దైవముగ భావించి ఆత్మానందమును పొందుచూ పరమపవిత్రమైన జీవనమును గడుపుచుండెను.

### 5. చ్యవనుడు అశ్వినులను సోమపీథుల చేయుట

చ్యవనుడు తనకు అశ్వినీపుత్రుల మూలమున నూతన యవ్వనము లభించిన కారణమున వారికి బదులు ఉపకారము చేయ తలంచెను. కావున అశ్వినీకుమారులకు సోమపానము చేయు అర్హత లేని కారణమున వారికి సోమపానమును చేయించెదనని ప్రతిజ్ఞచేసి వారిని పంపివేసెను. అటుపై యవ్వనవంతుడైన చ్యవనుని చూచుటకు సంయాతి అను రాజు వచ్చెను. అప్పుడు అతని అభివృద్ధి కొరకు ఒక యజ్ఞము చేయించ సంకల్పించెను. సంయాతికి ఆ విషయమును చెప్పగా అతడు సరియని అంగీకరించెను. అటుపై చ్యవనుడు తన భార్యయగు సుకన్యతో కూడి మామగారి ఇంటికి వచ్చెను. మంచి ముహూర్తమున శాస్త్రోక్తముగ సంయాతి చ్యవనుని సహాయముగ యజ్ఞము ప్రారంభించెను. ఇంద్రాది అష్టదిక్పాలకులు యజ్ఞమునకు వచ్చిరి. ఆ సమయమున చ్యవనుడు అశ్వినీదేవతలకు ఇచ్చిన మాట ప్రకారము సోమమును ఇవ్వబోవగ ఇంద్రుడు కోపించి "వారు దేవతలు కారు వారికి సోమపాన అర్హత లేదని" వారించెను. అయినను చ్యవనమహర్షి వారి మాటలను లెక్క చేయక అశ్వినేయులకు సోమపానమును గావించెను.

### 6. చ్యవనుడు ఇంద్రునకు గర్వభంగము చేయుట

ఇంద్రుడు తన మాటను లెక్కచేయక అశ్వినేయులకు సోమ పానమును కావించిన చ్యవనునిపై కోపించి వజ్రాయుధమును తీసుకొని అతనిపై వేయబోయెను. ఆ సమయమున ఇంద్రుడి హస్తము పైకి ఎత్తినది పైననే ఉండునట్లుగ అతని వజ్రాయుధముతో పాటు నిశ్చేష్టుని చేయగ అగ్నియందు వేల్వగ అందుండి గొప్ప బలవంతుడైన 'మధుడు' అను

రాక్షసుడు పుట్టెను. అతని భీకరాకారము ఇలా ఉన్నది. చేతులు పదివేల యోజనముల పొడవు, నాలుగు దంష్ట్రలు, సూర్యచంద్రులను పోలినటు వంటి కన్నులు, కాలాగ్ని వంటి నోరు, భూమి, ఆకాశములను తాకునటు వంటి శరీరము. ఇలాంటి భీకరాకారము కలిగినటువంటి ఆ రాక్షసుడు ఒక్కసారిగ నోరు తెరచి నాలుకతో పెదవులను లాగుకొనుచు భీకరమైన శబ్దముతో ఇంద్రుని మ్రింగబోయెను. ఆ దృశ్యమును చూచి భయపడిన ఇంద్రుడు చ్యవనుని చూచి తన తప్పును క్షమించమనియు నాటి నుండి అశ్వినీదేవతలకు సోమపానముచేయు వీలును కల్పించుచూ చ్యవనుని పాదములపై పడి రక్షించమని ప్రార్థించెను. అంత చ్యవనమహర్షి ఆతనికి అభయమిచ్చి ఆ రాక్షసుని నివారించి పంపివేయ ప్రయత్నించెను.

అప్పుడు 'మధుడు' అను రాక్షసుడు చ్యవనునికి నమస్కరించి తనకు ఆశ్రయమును చూపమని వేడుకొనెను. అంత చ్యవనుడు "నీవు మద్యస్త్రీమృగయాక్షములను ఆశ్రయింపుమని" ఆదేశించగ ఆ మాటలను విన్న మధుడు అంతర్ధానమయ్యెను. అలాగే ఇంద్రుడును యథాప్రకారము స్వర్గలోకమునకు తిరిగి వెళ్ళెను. అలాగే అశ్వినీ దేవతలును సంతసించి వారి లోకమునకు వెళ్ళిపోయిరి. ఈ విధముగ చ్యవనమహర్షి తన తపః ప్రభావమును వెల్లడి చేసిన ఆ పర్వతమునకు 'ఆర్చీక' పర్వతమని పేరు వచ్చెను[1]. ఇలా ఉండగా మరియొక సారి ఇంద్రుడు గర్వియై కోపించి చ్యవనునిపై ఒక పర్వతమును విసిరెను. అటుపై చ్యవనమహర్షి తన కమండలమునందలి నీటిని మంత్రించి ఇంద్రునిపై చల్లగ అది ఎదురు తిరిగి ఇంద్రనిపైనే పడెను. ఆ కారణమును వెంటనే ఇంద్రుడు మూర్ఛ పోయెను. అప్పుడు కూడ చ్యవనమహర్షి కరుణించి అతనిని మూర్ఛనుండి మేల్కొలిపెను. తన తప్పును గుర్తించిన ఇంద్రుడు తన దారిన తాను వెళ్ళి పోయెను.

1. భారతము, అరణ్యపర్వము, అనుశాసనికపర్వము

కావున చ్యవనమహర్షి యొక్క దయాహృదయము అపకారికి ఉపకారము చేయు గొప్ప ఔన్నత్యం తెలియుచున్నది. అలాగే ఋషులు ఆత్మజ్ఞులు. అనగ తమకు తాము తెలిసిన వారు. అహంకార రహితులు. ఎదుటివారి రజోతమోగుణముల వలన ఏర్పడిన ప్రకోపమును అణచుటకు క్రోధమునటించి శాపాయుధమున వారిని చక్కచేసి వారిని క్రమమైన మార్గమున తెచ్చెడి మహాశక్తిసంపన్నులు గల వారని చ్యవనుని ఇతివృత్తము వలన తెలియుచున్నది.

**7. చ్యవనుడు సుకన్యకు పుత్రులను అనుగ్రహించుట**

చ్యవనుడు సుకన్య ఎంతో సంతసముగ సకల భోగములతో కాలము గడుపుచుండిరి. ఒకనాడు చ్యవనుడు సుకన్యను పిలిచి "ఓ సుకన్యా! నేను ఇన్ని రోజులు ముసలివాడనని అసహ్యించుకొనక నాకు సేవలు చేయుచూ కాలము గడిపితివి. అందుచే ఒక కుమారుని అతనికి సమానమైన కీర్తిప్రతిష్ఠలు కలిగెడి మరి ఇరువురి కుమారులను అనుగ్రహించెదనని" పలికెను.

అంత సుకన్య సంతసముతో "మీ దయాచూపుకంటె నాకు కావలసినది ఏమి యున్నది" అని ఆనందముతో చ్యవనునితో స్త్రీ సౌఖ్యమును పొందెను. కాలక్రమముగ ఆమెకు దధీచి, ప్రమతి, ఆప్రవానుడు అను కుమారులు జన్మించిరి.

**8. చ్యవనుడు నహుషుని అనుగ్రహించుట**

చ్యవనుడు గృహస్థ ధర్మములను నెరవేర్చి ఒకానొక సమయమున గంగాయమునల సంగమమున అధిక నిష్ఠతో 'ఉదక వాసమహావ్రతము' (అనగ నీటిలో నుండి తపము చేయుట) చేయుచుండెను. అప్పుడు నీటిలోని చేపలన్నియు అతని చుట్టునూ తిరుగుచండెను. అటుపై ప్రేమ,

దయ కలిగిన చ్యవనుడు పన్నెండు సంవత్సరములు తపస్సు చేయు చుండెను. ఇలా ఆ చ్యవనమహర్షి సకల ప్రాణులయందును పరమ శుభమైన విశ్వాసమును కలిగి శుచి యై తపస్సు చేయుచుండగ ఆ జలము అతనికి ప్రదక్షిణములనొనర్చి భక్తితో కీడును తలంపలేదు. అటుపై ఒకనాడు జాలరులు చేపలను పట్టుకొనుటకై వలలను విసిరిరి. ఆ సమయమున చ్యవనమహర్షిని కూడా పట్టుకొని గట్టునకు లాగుకొని వచ్చిరి. అంత జాలరులు తమ తప్పులను తెలుసుకొని క్షమించమని ప్రార్థించెను. చ్యవనుడు వారిని చూచి "మీ కులవృత్తి మీరు చేయుటలో దోషము లేదు" నన్ను మీ మత్స్యములతోపాటు విక్రయించుకొనుడు అని చెప్పెను.

అంత జాలరులు జరిగిన ఇతివృత్తమంతయు తమ రాజగు నహుషునికి విన్నవించిరి. నహుషుడు ఆశ్చర్యపడినవాడై చ్యవనమహర్షి వద్దకు వచ్చి తమ జాలరులు చేసిన తప్పును మన్నింపమని కోరుకొనెను. ఆ సమయమున చ్యవనుడు వారు చేసిన తప్పుఏమిలేదు. తనకు వెల నిర్ణయించి ఆ జాలరులకు ఇమ్మని పలికెను. ఆ సమయమున నహుషుడు వరుసగ ఇట్లు పలికెను. మొదట నూరు మాడలను ఇచ్చెదనని పలికెను. అటుపై రాజ్యమంతయును ఇచ్చెదనని పలికెను. ఏది చెప్పినను చ్యవనుడు తన వెల ఇది కాదని పలికెను.

అటుపై 'కవిజాతుడు' అను ముని అచటికి వచ్చి గోవులు బ్రాహ్మణులతో సమానముకాన చ్యవనమహర్షికి ఒక గోవును ఇవ్వమని నహుషునితో చెప్పెను. అటుపై ఆ విషయమును చ్యవనునికి తెలిపెను. చ్యవనుడు ఆనందించి గోవుయొక్క ప్రభావమును గూర్చి నహుషునికి ఉపదేశించెను. నహుషుడు ఒక గోవును తీసుకొని వచ్చి జాలరులకు ఇచ్చెను. అంత ఆ జాలరులు ఆ గోవును చ్యవనమహర్షికే తిరిగి ఇచ్చి తమ్ము కృతార్థులను చెయ్యమని పరికిరి. అంత చ్యవనుడు వారికోరికలను

అంగీకరించి వారివద్దనున్న చేపలను, జాలరులకును స్వర్గలోకము కలుగునట్లు వరమిచ్చెను. వెంటనే వారు దివ్యవిమాన ఆరూఢులై స్వర్గమునకు వెడలిపోయిరి. అటుపై చ్యవనమహర్షి నహుషునికి ధర్మపరత్వము, ఇంద్రపదవి కలుగునట్లు ఆశీర్వదించెను. కావున చ్యవన మహర్షి ఆశీర్వాదము వలననే నహుషుడు ఒకసారి ఇంద్రుడు అయ్యెను.

### 9. చ్యవనమహర్షి కుశిక భూపతిని పరీక్షించుట

ఒకానొకనాడు దేవతలు, మునులు సురశ్రేష్టుడైన బ్రహ్మను సేవించుచుండగ ప్రసంగవసమున భృగు, కుశిక వంశములకు బ్రహ్మ నక్షత్రములు తడబడి సంకరములు కలుగునని చెప్పెను. (కుల వ్యవస్థ తడబడునని అర్థము). ఈ మాటలను చ్యవనమహర్షి కూడా వినెను. అప్పుడు చ్యవనుడు ఇట్లు తలంచెను. కుశికవంశమును అంతరింప చేసినచో సాంకర్యముకలగదని అనుకొనెను.

ఇట్లుండగ ఒకనాడు చ్యవనుడు కుశిక భూపాలుడగు కుశినాభుడు అనునతని వద్దకు వచ్చెను. ఆ సమయమున ఆతడు ఇతనిని అత్యంతముగ గౌరవించెను. తన బంధు మిత్రాదులతో చ్యవన మహర్షికి సేవచేయ మొదలిడెను. చ్యవనమహర్షి అభ్యంతరమందిరమున హంసతూలికా తల్పమున పడుకొని భార్యాభర్తలిరువురుని తన పాదములను ఒత్తుడని ఆజ్ఞాపించెను. కుశినాభుడు భార్యతోకూడా సేవచేయుచుండగ 21 దినములు చ్యవనుడు కదలకుండ నిద్రించెను. అతనికి నిద్రాభంగము కలుగునని కుశిక భూపాలుడు కదలకుండా సేవించుచుండెను.అటుపై 22వ రోజున తాను నిదురనుండి లేచి ఎచ్చటికో పోవ ప్రయత్నించెను. దంపతులు ఇరువురును అతనిని అనుసరించి కొంత దూరము పోయిరి. ఇంతలో చ్యవనుడు వారికి కనబడక అదృశ్యమయ్యెను. ఇక చెయ్యగలిగినది లేక భార్యభర్తలిరువురును విచారముతో ఇంటికిరాగా అదృశ్యమైన చ్యవనుడు

తమ అభ్యంతర మందిరములో మరొక తల్పముపై పరుండియుండెను. ఆశ్చర్యమున కు లోనైన దంపతులు అతని సేవలు చేయుచుండిరి. మునుపటి లాగే మరియొక 21 రోజులు చ్యవనమహర్షి నిద్రించెను. 22వ రోజు లేచి తనకు తైలాభ్యంగనము కావలెనని (శరీర మంతయు నూనెతో కూడిన స్నానము) కోరుకొనెను. రాజు మిగుల భక్తి యుతుడై తైలాభ్యంగనము చేయుచుండగ అతడు తిరిగి మాయమయ్యెను.

చ్యవనుడు మధ్యాహ్నము దాటిన తరువాత వచ్చి స్నానము చేసెను. కుశినాభుడు భార్యతో కూడినవాడై చెలింపక భోజనమునకు రమ్మని ఆహ్వానించెను. ఇంతలో ఇతడు మాయమయ్యెను. ఇలా చ్యవనమహర్షి కుశనాభుని ఎన్నియో పరీక్షలు గావించెను. అటుపై భార్యాభర్తలు ఇరువురును భుజింపక అతనికోసము ఎదురుచూచుచుండగ మరుసటి రోజు ఉదయము కనబడి "నీవును నీ భార్యయును నేనెక్కిన రథమును లాగు"డని పలికెను. ఇక్కడే వారికి అసలు పరీక్ష ప్రారంభమయ్యెను. రథమును లాగుచుండగ రక్తముకారునట్లుగ వారిని బాధించెను. వారికి ఆయాసము కల్గినను వారు చెలింపలేదు. ఇంతలో చ్యవనుడికి వారిపై దయకలిగి వారిని తాకినంతనే ఆయాసము పోయి నవయవ్వనులు అయిరి. అటుపై చ్యవనుడు వారి ఇంటికి పోయి మరునాడు తాను గంగాతీరమున చేసెడి యజ్ఞమునకు రావలెనని చెప్పి పంపివేసెను.

కుశికభూపతి ఇంటికి పోయి తాను చేయవలసిన దైనందిన కర్మలను ఆచరించి మరునాడు స్నానాదులు చేసి భార్యాసహితుడై చ్యవన మహర్షి రమ్మన్న చోటుకి కుశికనాభుడు వెళ్ళెను. ఆ ప్రదేశమున మునులతో ప్రకాశించెడి దివ్యమైన మేడలు, మండపములు, ఆరామ ప్రదేశములు, కొలనులు, క్రీడాపర్వతములు, దేవతలు, కిన్నెరలు కింపురుషులు, గంధర్వులు మొదలగువారితో కూడి ఆ ప్రదేశము నిండుగయుండెను.

అందొక దేవతాభవనమున చ్యవనుని చూచిరి. కాని వెంటనే ఆ చ్యవన మహర్షి మేడలతో కూడ అదృశ్యమయ్యెను. మరికొంత సేపటికి చ్యవనుడు వారిరువురిని పిలిచి "పరీక్షచేయుటకై ఇన్ని పనులను చేసితిని. నీకు మనస్సు ఇంద్రియములు స్వాధీనముగ యుండుట చిన్నపనికాదు. నాకు ఆనంద మయినది. నేను ఎందులకు ఈ పనిని చేసితిని అనగ నీ ఓర్పును పరీక్షించి నీ యందు తప్పును కనిపెట్టి నీ వంశక్షయమగు టకు శపించుట కోసమే కాని నీవు నా పరీక్షలలో నెగ్గితివి, మీ భార్యభర్తలలో ధైర్యము, శాంతము, శోకము లేకపోవుట అనునవి నేను గమనించితిని. కావున దయతలచి ఇట్లు స్వర్గమునే భూమిపై చూపితిని.

కావున నీకు మూడోతరమువాడు బ్రహ్మతేజోదీప్తుడై పుట్టును. నా తనయుని తనయుడు ఋచీకుడు నీ తనయుని గాధి కూతురినికి పరిణయమై 'జమదగ్ని' అను వానిని కని ఆతనియందు సమస్త ధనుర్వేదమును నిలుపును. మహాక్షత్రముతో ఆ జమదగ్నికి పుత్రుడై 'పరశు రాముడు' జన్మించును. గాధికి బ్రహ్మర్షియగు 'విశ్వామిత్రుడు' జన్మించును" అని పలికి చ్యవనమహర్షి తన దారిన తాను వెళ్ళెను. కుశికుడికి బ్రహ్మా నందము కలిగెను. కావున ఋచీకుని మూలమున భార్గవవంశమున జమదగ్నియు, అతనికి పరశురాముడును, కుశికవంశమున విశ్వామిత్రుడును జన్మించిరి[1].

### 10. పాము ఒకటి చ్యవనుని పాతాళలోకమునకు ఈడ్చుకొని పోవుట

పూర్వము చ్యవనుడు నర్మదనదియందు స్నానము చేయు చుండగ ఒక పెద్దపాము అతనిని పట్టుకొని పాతాళమునకు పోవుచుండగ చ్యవనమహర్షి పరమేశ్వరుని ప్రార్థించెను. పరమేశ్వరుని దయవలన చ్యవన మహర్షికి ఆపాము విషబాధ కలుగలేదు. ఆ పాము పాతాళ లోకమున

1. ఈ వృత్తాంతము మనకు భారతమున అనుశాసనిక పర్వమున కలదు

నాగకన్యల వద్ద వదిలెను. ఆ నాగ కన్యలు అతనిని ఎంతో భక్తితో సేవించు చుండెను.

అపుడు పాతాళలోకమును పాలించు ప్రహ్లాదుడు అతనికి నమస్కరించి బహుశ ఇతడు తన గుట్టురట్టును తెలుసుకొని రమ్మని ఇంద్రుడు పంపిన దూతగ అనుమానించెను. అతని భావమును తెలుసుకొని చ్యవనుడు నాకు ఇంద్రునితో పనిలేదనియు నేను నర్మదానదిలో స్నానము చేయుచుండగ ఒక పెద్దపాము తనను పాతాళములకు తీసుకొని వచ్చెనని చెప్పెను. అందులకు ప్రహ్లాదుడు సంతసించి "ఓ ఋషీంద్రా! నీ రాక వలన నేను ఎంతగనో పవిత్రుడనైతిని. నీవు తిరుగని తీర్థములు స్నానము చెయ్యని నదులును ఉండవు. కావున నీవు తీర్థ పరమార్థములను నాకు చెప్పమని" పలికెను.

అంత చ్యవనుడు సంతసించి "ఓ విష్ణు భక్తాగ్రేసరా! నీ వంటి విష్ణుభక్తుడు ఎవ్వరునూ లేరు. నీ ప్రశ్నలకు సమాధానమును చెప్పెదను వినుము. అయినను ఒక్క విషయము చిత్తశుద్ధి లేని తీర్థాటనము వ్యర్థము. మనస్సు నిర్మలముగ ఉండవలెను కాని గంగలో మునిగినంత మాత్రమున లాభములేదు. తీర్థవాసము చాలా కష్టము. తీర్థములందు చేసిన పాపము ఏ విధముగను నశించదు. అక్కడ చేసిన పాపములు అత్యధిక దుఃఖ కరములు. ముఖ్యముగ సర్వతీర్థములను తిరుగుటకంటే కూడా మనకు కావలసినవి భూత దయ, సత్యము, సౌచము. ఇవి కలవారి పాదముల క్రిందనే సకల తీర్థములు వచ్చి వసించును. అయినను సకలలోక శ్రేష్ఠములు భూలోకమున తీర్థములని" పలికెను. ఆ మాటలు విన్న ప్రహ్లాదుడు చ్యవనుని అత్యంత భక్తితో వీడ్కొలిపి తీర్థయాత్రలు చేయుటకై సపరి వారముగ బయలుదేరెను.[1]

1. ఈ వృత్తాంతము మనకు బ్రహ్మవైవర్త పురాణమునకలదు.

## 11. చ్యవనుడు లవణాసురుని వధకు కారణమగుట

ఒకానొకనాడు 'మధుడు' అను రాక్షసుడు శివుని మెప్పించి అతనిచే శక్తివంతమైన శూలమును గ్రహించి ఆ శూలము తనకుమారునకు కూడా ఉపయోగింపవలెనని శివుని కోరుకొనెను. శివుడు అందులకు అంగీకరించి ఈ శూలము చేతియందుండగ శత్రువులెవ్వరును జయింపలేరనియు, అట్లుగాక శూలము చేతియందు లేక యుద్ధము చేసినచో శత్రురాజుల చేత యుద్ధమున ఓడెదవని చెప్పి అదృశ్యమయ్యెను.

మధుడు 'కుంభీనసి' అను స్త్రీని (రావణుని చెల్లెలు)ను వివాహ మాడెను. వారిరువురుకి జనించినవాడే 'లవణుడు' అను రాక్షసుడు. ఈ లవణుడు తండ్రియగు మధుడు చనిపోయిన తరువాత తండ్రి ఇచ్చిన శూలమును పొంది పూజలు చేయుచుండెను. ఇలా కాలము జరుగు చుండగ లవణాసురుడు మహర్షులను అనేక బాధలు పెట్టుచుండెను.

ఇట్లుండగ ఈ లవణాసురుని చంపించుట ఎట్లని ఒకానొకరోజున మరీచి, కశ్యప, దళాద, పులస్త్య , ఋచీక మొదలగు మహర్షులు చ్యవన మహర్షిని ఉపాయము అడిగిరి. ఈ వృత్తాంతము మనకు త్రేతాయుగమున జరిగినట్లు తెలియుచున్నది. అంత చ్యవనునితో కూడిన ఋషులందరు నాటి త్రేతాయుగ చక్రవర్తి అయిన అయోధ్యా రాజగు శ్రీరాముని వద్దకు వెళ్ళి ఈ లవణాసురుని యొక్క దుఃచ్ఛేష్టలను వివరించిరి. వారి మాటలను విన్న శ్రీరాముడు వెంటనే తన సోదరుడగు శతృఘ్నుని 'లవణాసుర' వధకు నియమించెను. చ్యవనుడును శ్రీరాముని అనేక విధముల స్తుతించి మహర్షులతో కూడి తన ఆశ్రమమునకు వెళ్ళెను.

అటుపై శతృఘ్నుడు సేనాసమేతుడై బయలుదేరి వెళ్ళుచూ వాల్మీకి ఆశ్రమమున ఒక రాత్రి గడుపగ అదే రోజున రాత్రి సీతామహాసాధ్వి 'కుశలవులను కనెను' అన్న శుభవార్తను వినెను. అటుపై శతృఘ్నుడు

చ్యవనమహర్షి ఆశ్రమమునకు వచ్చెను. చ్యవనుడు అతనికి మాంధాతను లవణాసురుడు చంపిన విధానమును చెప్పి అతని చేతియందు శూలము లేని సమయముననే చంపమని హితము చెప్పి పంపెను. శత్రుఘ్నుడును చ్యవనుని మాటలను గుర్తుంచుకొని శూలములేని సమయముననందే లవణాసురుని చంపివేసెను. ఆ వార్తను విన్న మునులందరును మిగుల సంతసించిరి[1].

**సింహావలోకనము-** భృగుమహర్షి వంశమున శ్రేష్ఠుడైన చ్యవనమహర్షి మహాతపోనిష్ఠాగరిష్ఠుడు. ఆత్మ తపోబల సంపన్నుడు, లోకహితార్థి. ఋషులలో అగ్రేసరుడు అని అనేక పేర్లతో లోకమున ప్రకాశించెను.

### చ్యవనమహర్షి స్తుతి

"పులోమ భృగుమహర్షి కుమారా! చ్యవన మహర్షి నామా!సుకన్య పతే!
పులోమ రాక్షస భస్మీకృత ఋషివర్యా! నహుష రాజ వరప్రదాతా!
పులోమ పుణ్యపుత్రా! లవణాసుర వధ కారకా! దేవేంద్ర గర్వభంగా!
పులోమ భృగుమహర్షి కీర్తిచంద్రా! శ్రీరామ సందర్శకా! నమస్తే నమః"

❖ ❖ ❖

1. ఈ వృత్తాంతము మనకు ఉత్తరరామాయణమున కలదు.

# 3. జమదగ్నిమహర్షి

### 1. జమదగ్నిమహర్షి జనన వృత్తాంతము

పూర్వము భృగువంశమున పుట్టిన ఋచీక మహర్షి కుశికవంశ ఉద్భవుడగు గాధిరాజు కూతురు సత్యవతి అను ఆమెను వివాహము చేసుకొన దలచి తన కోరికను గాధిరాజుకు తెలిపెను. అంత గాధిరాజు అతడు తన కూతురునకు తగిన వరుడు అవునో కాదో అని అతనిని పరీక్షింప తెల్లనిదేహములు, నల్లని చెవులు గల వేయి గుఱ్ఱములను తన కూతురనకు అరణముగా(కట్నముగ) ఒసగినచో సత్యవతినిచ్చి పెళ్ళి చేయుదునని చెప్పెను.

ఋచీకమహర్షి అందులకు సమ్మతించి వరుణదేవుని ప్రార్థించి అతనిచే అట్టి అశ్వములను పొంది తీసుకొనివచ్చి గాధిమహారాజునకు ఇచ్చెను. గాధిరాజు కూడా ఋచీకుని శక్తిసామర్థ్యములకు మెచ్చుకొని అతనికి తన కూతురగు సత్యవతినిచ్చి వైభవముగ వివాహము చేసి ఋచీకమహర్షి ఆశ్రమమునకు పంపెను.

సత్యవతికూడా భర్తయేదైవముగ భావించి తన అదృష్టముచే ఉత్తమ బ్రాహ్మణుడు తనకు భర్త అయ్యెనని సంతసించి అతనికి అనేక విధముల సేవలు చేయుచుండెను. ఆమె సేవలకు మెచ్చి ఋచీక మహర్షి నీకు కావలసిన కోరికలు ఏవో చెప్పమని పలికెను.

అప్పుడు సత్యవతి పుత్రహీనులైన తన తల్లిదండ్రులను ఒక పుత్రుని తనకు ఒక కుమారుని పొందునటుల ఋచీకుని ప్రార్థించెను. అంత ఋచీక మహర్షి సరియని ఒప్పుకొని రాజబ్రహ్మ మంత్రములచే రెండు చరువులను వేల్చి ఆరెండింటిని భార్యకు ఇచ్చి "ఓ సాధ్వీ! క్షత్రియులలో శ్రేష్ఠుడు, క్షత్రియశత్రుసంహారి, క్షత్రియఅజేయుడు అగువాడు మొదటి చరువును ఉపయోగించిన వారికి కలుగును. కావున దానిని మీ అమ్మకు ఇచ్చి ఈ రెండవ చరువు నీవు ఉపయోగించుము. నీకు తపస్సునందు ధైర్యము ఓర్పు కలిగిన ఉత్తముడైన బ్రాహ్మణుడు జన్మించునని" చెప్పి ఋచీకమహర్షి నదీ స్నానమునకు పోయెను.

ఇంతలో కుమార్తెను అల్లుడిని చూచుటకు గాధిమహారాజు తన భార్యతో కూడా ఋచీకుని ఆశ్రమమునకు వచ్చెను. సత్యవతి ఆనంద పరవశముతో ఆశ్రమమునకు వచ్చిన తల్లిదండ్రులను చూచి భర్త తనకు ఉపదేశించిన రాజమంత్ర ప్రభావముగల చరువు వృత్తాంతమును తెలిపి తొందరపాటులో తానుపయోగించవలసిన చరువును తల్లికిచ్చి, తల్లికి ఇవ్వవలసిన దానిని తాను గ్రహించెను.

అటుపై నదీస్నానమునకు పోయి వచ్చిన ఋచీకమహర్షి తన దివ్యదృష్టితో తల్లీ కూతురులు చేసిన పనిని గ్రహించి సత్యవతిని చూచి "నీకు క్షత్రియులను సంహరించువాడును మహాక్రూరుడును అగు కుమారుడు పుట్టును. మీ అమ్మకు బ్రహ్మపుత్రుడు, తపోధనుడు అగు కుమారుడు పుట్టునని" చెప్పెను. అందులకు భయపడిన సత్యవతి అది ఏమని అడుగగ, ఋచీకుడు "నేను నీకు ఉత్తమ బ్రాహ్మణుడు పుట్టునట్లు మీ తల్లికి ఉత్తమ క్షత్రియుడు పుట్టునట్లు మంత్రమును చదివి చరువులను వేల్చి చేసితిని. నీవు ఉపయోగించవలసినది మీ అమ్మయును ఆమె ఉపయోగించవలసినది నీవును ఉపయోగించితిరి. కావున అట్లు వ్యత్యాసము కలుగును" అని పలికెను.

అంత సత్యవతి భయపడి క్రూరుడగు కుమారుని నేను కనలేను రక్షింపమని వేడుకొనగ ఋచీకుడు ఆమెను కరుణించి ఆ క్రూరత్వము నీ కుమారునికి కాక మనుమడికి కలుగునని పలికెను. అంత కాలక్రమమున సత్యవతి గర్భమున జమదగ్ని మహర్షియు ఆమె తల్లి కుడుపున విశ్వామిత్రుడును జన్మించిరి[1].

## 2. జమదగ్ని రేణుకను వివాహమాడుట

సత్యవతి గర్భమున జన్మించిన జమదగ్ని మహర్షి ఉత్తమ గుణ సంపన్నుడై కాలక్రమమున రేణువు కూతురు అయిన రేణుకను వివాహ మాడి గార్హస్త్యజీవితమును గడుపుచుండెను. జమదగ్నిమహర్షి తన తపో మహాత్మ్యమున ఒక హోమధేనువును సంపాదించెను. ఆ హోమ ధేనువు వలన జమదగ్ని దంపతులు కావలసిన వాటిని పొందుచుండిరి. ఈ విధముగ కామధేనువు కారణముగ ఏ కొరతయు లేక సమస్త భోగములను అనుభవించుచు మహాతపఃసంపన్నుడై కాలముగడుపు చుండెను.

## 3. జమదగ్ని సూర్యుని శపించుట

జమదగ్ని రేణుకయొక్క పతిభక్తికి మెచ్చి ఆమెతో నర్మదానదీ తీరమునందు ఎవరు జనములేని ప్రదేశమున ఫలములతోను పుష్పముల తోను కూడినట్టియు చిలుకలు మొదలగు చిరు పక్షులతో కూడినట్టియు నెమళ్ళ శబ్దముతో కూడినట్టియు మంచి వాసనలు కలిగిన శ్రేష్ఠమైనటువంటి సువాసనా భరితమగు వనమునకు వెళ్ళి విహరించుచుండెను. వారు అప్పుడే వికసించిన పుష్పములు తమకు తల్పములుగ ఏర్పరచుకొని, చందనాదు లతో అలంకరింపబడిన దేహములు కలిగినవారై నక్షత్ర చుంబనాదులతో పరిపూర్ణమైన మన్మథక్రీడలలో ఆనందసంద్రమున తేలియాడుచుండిరి.

---

1. ఈ వృత్తాంతము భారతమున కలదు.

ఆ సమయమున పట్టపగలే రతిక్రీడలు సలుపుచున్న వారివద్దకు సూర్యుడు బ్రహ్మరూపమున వచ్చి "ఓ జమదగ్నీ! నీవు బ్రహ్మకు మనుమడవు వేదకర్తవు గొప్ప తపః సంపన్నుడివి. ఇటువంటి మహనీయుడవైన నీవు పట్టపగలే ఇలాంటి సురతక్రీడకావించుట ధర్మమా?" అని పలికెను. "యద్య దాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరోజనః" అను నానుడిని బట్టి అనేకులు నిన్నే అనుసరించుదురు కదా! తాపసులలో శ్రేష్ఠుడవైన నీవే ధర్మమును తప్పిన యొడల వేదధర్మములు నశించునుకదా! నేను కర్మసాక్షిని అగుటచే ఇట్లు చెప్పవచ్చితిని" అని పలికెను.

అదివిన్న జమదగ్ని మన్మధుడిని ఆపి నిలువగ, నగ్న అయిన రేణుక వెంటనే సూక్ష్మ వస్త్రమును ధరించి సిగ్గుపడి నిలచెను. అంత జమదగ్ని సూర్యునితో "నీవు పండిత అహంకారముతో నాకు చెప్పవచ్చితివా? భృగు మహర్షి శిష్యుడగు నేను నాలుగు వేదములందలి ధర్మాధర్మములు తెలియని వాడనా? అజ్ఞాని స్వకర్మచే ఎల్లప్పుడూ జడీభూతుడగును. కాని విజ్ఞాని సర్వభక్షకుడగు అగ్నివలె మహాతేజస్వియై కర్మదోషములను చూడడు. నీవు కర్మసాక్షివనియు ఫలప్రదాతవనియు అన్నింటికి శాస్తననియు (నియంత) గర్వించి నన్ను ఆక్షేపించ వచ్చితివి.

మేము తపోధన విరాజితులము, జ్ఞాన మూర్తులము. మాకు నారాయణుడే సర్వరక్షకుడు. మమ్ములను గూర్చి ఆయనకు తెలియును. ఆయనను గూర్చి మాకు తెలియును. మాకు ఇతరులు బోధింప మేము సహింపము. నీవే కాదు బ్రహ్మదేవుడు, రుద్రుడు, యముడు మొదలగు వారుకూడ మమ్ములను శిక్షింపలేరు. అటువంటి మా దంపతులు ఇరువురిని ఆనందముగ సుఖముగ ఉన్న సమయమున మాకు రతీభంగము కలిగించి నావు. కావున రాహు గ్రస్తుండవై (రాహువు చేత మ్రింగబడిన వాడివై) పాప దృశ్యుడవై (పాపములు కలిగిన వాడవై) తేజస్సును నశించిన వాడవు అగు దువు" అని శపించెను.

సూర్యుడది విని "అయ్యా! మనము ఒకరినొకరు పూజింప దగిన వారము. ఇప్పుడు నీవు నన్ను శపించితివి. నేను ఊరకున్నచో లోకులు నన్ను అశక్తుడని తేజస్సును లేనివాడని నిందించును. నీకును ఒక క్షత్రియునిచే పరాభవము ఆతని ఆయుధముచే మరణము పొందుదువని" ప్రతిశాపము ఇచ్చెను. అటుపై జమదగ్ని మరల కోపించి "నీవు శివునిచే జితుండవగుదువని" మరల శపించెను. ఈ వృత్తాంతమును కశ్యప ప్రజాపతి వలన తెలుసుకొన్న బ్రహ్మ ఒక క్షణకాలములో సూర్య జమదగ్నుల వద్దకు వచ్చి ఇలా పలికెను.

బ్రహ్మ వారిరువురిని శాంత పరచి సూర్యునితో "ఓ దినకరా! నీవు ఒకానొక దినమున మేఘములతో కప్పబడిన వాడవై ముక్తుడవు అయ్యెదవు. మేఘములు ఎక్కువగ ఉన్న కాలమైనను వర్షము ఎక్కువగ వచ్చిన కాలమైనను రాహువు చేత మ్రింగబడిన వాడవు అయ్యెదవు" అని పలికెను.

"కాని నీవు కొందరికి అదృశ్యుడవు కొందరికి పూర్ణదృశ్యుడవు అగుదువు. నిన్నుచూచి నమస్కరించి సర్వజనులు పాపహీనులగుదురు. జన్మలగ్నమునకు సప్తమ అష్టమ చతుర్ధ దశమ స్థానములందును, జన్మ ఋషనిధనములందు నీవును, చంద్రుడును అదృశ్యులగుదురు. అలాగే అస్తకాల ఘనాచ్ఛన్నకాల మధ్యాహ్న కాలములందు జపము లందు అర్ధోదిత కాలములందు నీవు పాపదృశ్యుడవు అగుదువు. భార్యదుఃఖ నిమిత్తము కారణభూత అయిన భార్యచేతను స్వసుర చేతను బావమరదులచేతను నశింపబడిన తేజస్సుగల వాడవు అగుదువు. మాలీసుమాలీ యుద్ధమున శివుడు నిన్ను జయించును" అని బ్రహ్మ పలికెను. అలాగే బ్రహ్మ జమదగ్నిని చూచి "ఓ మహాశయా! పరాజయముతో సిగ్గుపడిన వాడైన సూర్యుని ఇంతటితో వదిలి పెట్టుము. నీ తేజస్సువలన క్షణమాత్రములో జగమంతయు

భస్మమగుట నిజము. నీవును సూర్యుడును పరస్పరము పూజ్యులు. కావున సూర్యుడిచ్చిన శాప విధముగ కార్తవీర్యార్జుననిచే పరాభవమును ఓటమిని మరణమును పొందెదవు. నీకు విష్ణుమూర్తి కుమారుడిగ జన్మించి ముయ్యేడు(21)సార్లు జగమంతయు క్షత్రియులు లేకుండ చేయును. నీ మరణము లోక కళ్యాణమునకు బీజము కాగలదని" పలికి బ్రహ్మవాక్కుగ వారిరువురి చరిత్రలను తెలిపి మాయమయ్యెను.

ఇక జమదగ్ని సూర్యులిరువురును పరస్పరము అభినందించు కొని చేసిన కర్మముల ఫలితముల నివారింప సమర్థుడు ఎవ్వడూ లేడనుకొని శాంతపడి తమ తమలోకములకు వెళ్ళిరి[1]. రేణుకా దేవి భర్తకు పరమభక్తితో సేవలు చేయుచూ జమదగ్ని మహర్షి కటాక్షమున వరుసగా ఐదుగురు కుమారులను పొందెను. వారు రుమణ్వతుడు, సుసేషణుడు, వసువు, విశ్వావసువు, పరశురాముడు అను పేర్లను పొందిరి. పరశురాముడు విష్ణు అవతారమై జన్మించెను. ఈ విధముగ పతివ్రతయైన రేణుకాదేవి తన ఐదుమంది కుమారులను పెంచుకొనుచు తన భర్త సేవలను చేయుచూ బాగుగ కాలము గుడుపుచుండెను.

### 4. పరశురాముని పితృభక్తి

ఒకానొకనాడు జమదగ్ని భార్యయైన రేణుకాదేవి జలమునకై ఏటికి పోయెను. అందు చిత్రరథుడు అను రాజు భార్యతో కూడి జలక్రీడలలో ఆనందపరవశముగా ఉండెను. వారిని చూచి రేణుకాదేవి విధివశమున వారి జలక్రీడలపై కోరిక జనించెను. తాను మైమరచి వారి ఆనందమును చూచుచుండెను. దీనివలన ఏమైనదనగ 'ఆమె ఉత్తమమైన పాతివ్రత్యము నకు దోషము కలిగి చేతి యందలి నీటి కడవ క్రిందపడి ఛిన్నాభిన్నమై

---

1. మనకు ఈ వృత్తాంతము బ్రహ్మవైవర్తపురాణము, భారత అనుశాసనిక పర్వమున ఉపానద్దాన విషయకమగు సూర్యజమదగ్ని సంవాదమున కలదు.

పోయెను. కాని మామూలుగ ఎప్పుడైనను ఇలా జలకుండ పొరపాటున క్రిందపడి పగిలినచో తన పతివ్రతా ధర్మమున ఇసుకతీసి పాత్రగా తయారు చేసినచో అది తయారు అయ్యేడిది. కాని ఈ సారి అట్లు కాలేదు. కారణం ఆ చిత్రరథ దంపతుల యొక్క జలక్రీడచూచి ఇంద్రియ నిగ్రహము కోల్పోవుటయే'. అట్టి సమయమున రేణుకాదేవి తన పాతివ్రత్య మహిమకు తప్పిదము జరిగినదని గ్రహించి ప్రక్కనే ఉన్న నదిలోపడి మరణింప ప్రయత్నించెను. కాని పతికి జరిగిన విషయము చెప్పి అతని ఆజ్ఞాబద్ధురాలుగ ప్రవర్తించటము శ్రేష్ఠమని తలంచి నీటికుండ లేకుండ ఇంటికి పోయెను.

ఎప్పుడైతే నీటి కుండ లేకుండ ఇంటికి వచ్చిన రేణుకను చూచి దివ్యదృష్టితో అంతయు గమనించిన జమదగ్ని ఇట్లు తలంచెను. చిత్రరథునిపై ప్రేమను కలిగిన తన భార్యయొక్క మనసులోని భావనను అసహ్యించుకొని ఆ దోషమును ఆమెకు మరణదండమే శిక్షయని నిశ్చయించుకొనెను. వెంటనే జమదగ్ని వరుసగ తన కొడుకులను పిలిచి తల్లిని చంపివేయుడని ఆజ్ఞాపించెను. ఇక్కడ మహర్షియొక్క భావనలో మనకు తెలిసినది ఏమనగ మానసిక వ్యభిచారముకూడా ఒక వ్యభిచారమే అని. ఎందుకనగా ఉత్తమపతివ్రతయైన రేణుక ఎప్పుడైతే ఇంద్రియ నిగ్రహము కోల్పోయి చిత్రరథునిపై మనస్సు కలిగెనో అప్పుడే ఆమెకు దోషము సంభవించినదని దివ్యదృష్టితో చూచిన జమదగ్ని యొక్క ఉద్దేశ్యము మనకు తెలియుచున్నది.

జమదగ్ని ఆజ్ఞచేసినప్పటికీ మొదటి నలుగురు కుమారులు అంగీకరించలేదు. కాని చివరివాడైన పరశురాముడు తండ్రి ఆజ్ఞమేరకు తల్లియైన రేణుకాదేవిని, సోదరులను తన గొడ్డలితో ఖండించెను.అటుపై పరశురామునికి గల పితృభక్తికి మెచ్చుకొని జమదగ్ని సంతసముగ నీకు ఏమి వరము కావలయునో కోరుకొనమనెను. అందులకు పరశురాముడు

చనిపోయిన తన తల్లిని, సోదరులను బ్రతికింపమని కోరెను. జమదగ్ని పరశురాముని మాతృప్రేమకును సోదరులపై గల వాత్సల్యమునకు మెచ్చుకొని అట్లే చేసెను.

## 5. జమదగ్నిమహర్షి కార్తవీర్యుని చంపిన పరశురామునిచే దోషపరిహారము గావించుట

పూర్వకాలము హైహయాధీశుడగు కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయుని ఆరాధించి అతని వలన కొన్ని వరములను పొందెను. అవి ఏమనగా శత్రుజయం, వెయ్యిచేతులు, అణిమాది అష్టసిద్ధులు, యశము, బలము, యోగీశ్వరత్వము, తేజము చెడని ఇంద్రియములు. ఈ వరములవలన ఎన్నో కార్యములను చేయుచూ కాలము గడుపుచుండెను.

ఇట్లుండ ఒకానొకరోజున దిగ్విజయయాత్రకై వచ్చిన రావణాసురుని కార్తవీర్యార్జునుడు అవమానించెను. అటుపిమ్మట కార్తవీర్యార్జునుడు దైవయోగమున వేటకై అడవిలో సంచరించుచూ జమదగ్ని ఆశ్రమమునకు వెళ్ళి అతనిని దర్శించెను. జమదగ్ని మహర్షి రాజును, అతని సేవకులను చూసి అలసి యుండుట గుర్తించి వారిని పూజించి తన హెూమధేనువును రప్పించి ఇష్టాన్నములను కురియించి వారిని ఆరగింపుడని కోరెను.

కార్తవీర్యార్జునుడు బ్రహ్మానందముతో ఆ కామధేనువు వలన పొందిన షడ్రుచులు కలిగిన విందును స్వీకరించి తన వారితోకూడి అతఃపురమునకు వెళ్ళెను. కాని అప్పుడు అతనికి గోవుపై ఒకకోర్కె కలిగెను. చివరకు తన పట్టణమునకు పోయిన తరువాత ఆ గోవుపైగల ఆశచే జమదగ్ని నుండి ఆ కామధేనువుని తీసుకొని రమ్మని పంపెను. ఆ రాజ భటులు జమదగ్నితో యుద్ధమునకు సిద్ధపడిరి. జమదగ్ని సురభితో ఈ విషయమును తెలిపెను. వెంటనే ఆ కామధేనువు రోమములనుండి గొప్ప

వీరులు సైనికులు ఉత్తమములైన రథ అశ్వములు రాగా వానితో జమదగ్ని కార్తవీర్యుని సేనలతో పోరాడెను. కార్తవీర్యుని సైనికులు జమదగ్ని చేతిలో చనిపోగా చివరకు కార్తవీర్యార్జునుడే సైన్యముతో వచ్చి జమదగ్నితో పోరాడెను. ఇలా 20 పర్యాయములు వారిద్దరికి యుద్ధము జరిగెను. ఇక చివరికి 21వ సారి కామధేనువైన సురభి వాక్యమును లెక్కచేయని జమదగ్నిని సంహరించి తనకు కావలసిన కామధేనువైన సురభిని వెదక చూచెను. ఇక చేయునది లేక కార్తవీర్యార్జునుడు వట్టి చేతులతో యింటికి పోయెను.

ఇలా ఉండగా చనిపోయిన తన భర్తయగు జమదగ్నితో రేణుకాదేవి సహగమనము చేయ ప్రయత్నించెను. అంత ఆకాశవాణి వలదని వారించెను. ఇంతలో భృగుమహర్షి వచ్చి జమదగ్నిని బ్రతికించెను. అటుపై జమదగ్ని కుమారుడైన పరశురాముడు వచ్చి జరిగిన సంగతిని తెలుసుకొని కార్త వీర్యార్జునుపై కోపబడి అతనిపై పోరాడుటకు తండ్రి అనుమతిని తీసుకొని భయంకరమైన గొడ్డలి, కవచము, కోదండములతో కార్తవీర్యార్జునుని రాజ్యమైన మహిష్మతీ పురమునకు పోయెను.

అటుపై కార్యవీర్యార్జునుడు తన దండనాయకులకు పరశురాముని చంపుడని 17 అక్షౌహిణుల సేనలను పంపెను. పరశురాముడు ఒక్క క్షణమున వారినందరిని రూపుమాపెను. కార్తవీర్యార్జునుడు యుద్ధమునకు రాగ అతని వెయ్యి చేతులను త్రుంచి తన గండ్రగొడ్డలిచే అతని శిరమును ఖండించెను. అటుపై జమదగ్ని ఆశ్రమమునకు వెళ్ళి పరశురాముడు తండ్రికి జరిగినదంతయు చెప్పెను. కాని అతడు ఊహించినట్లుగ తండ్రి సంతోషపడక ఇలా పలికెను. "రాజు ఎంత దుష్టుడైనను అతనిని చంపుట దోషము. కావున ఆ దోష పరిహారమునకు నీవు ఒక సంవత్సర కాలము తీర్థయాత్రలు చెయ్యమని" కొడుకును శాసించెను. పరశురాముడు తండ్రి ఆజ్ఞను శిరసావహించి తీర్థయాత్రకు బయలుదేరెను. ఇక్కడ మనకు జమదగ్ని యొక్క 'ధర్మసంహిత బుద్ధి' కొనియాడ దగినది.

అటుపై కార్తవీర్యార్జునుని కొడుకులు దీనికి అంతటికి కారణము జమదగ్నియే అని అతని హెూమగృహముచేరి అతనిని పట్టి చంపెను. రేణుకా దేవియు అతనిపైపడి "పరశురామ! వచ్చి తండ్రిని రక్షింపమని 21 సార్లు కేకలు వేసెను". అంతలో తీర్థయాత్రనుండి పరశురాముడు వచ్చి తండ్రి మరణమునకు విచారించెను. అటుపై తల్లి 21 మార్లు పిలచినది కావున కార్తవీర్యునే కాక క్షత్రియు లెల్లరను సంహరించి వారి రక్తప్రవాహమున తండ్రికి తర్పణములు ఇచ్చుదునని పరశురాముడు సోదరులను ఊరడించి 21 మార్లు భూమిపై సంచరించి క్షత్రియులను సంహరించెను. ఈ లోపున రేణుకాదేవియు భర్తకై ప్రాణములను వదిలెను.

పరశురాముడు తాను చేసిన ప్రతిజ్ఞను పాలించి క్షత్రియ రక్తముతో తండ్రికి తర్పణములు విడిచిపెట్టెను. చివరికి ఉత్తమోత్తమ కుమారుడిగ పితృఋణమును తీర్చుకొనిన కుమారుడిగ జమదగ్ని కుమారుడిగ మహావిష్ణువుని యొక్క స్వరూపమును ధరించిన వాడిగ పరశురాముడు వెయ్యి నోళ్ళ కొనియాడబడెను[1].

## జమదగ్నిమహర్షి స్తుతి

"జమదగ్ని నామ ఋషే! సత్యవతీ ఋచీక ఋషి పుత్రా! రేణకా పతే!
జమదగ్ని రేణుకా సంతాన ఫల పరశురామాది వీర పుత్ర పితా!
జమదగ్ని ఋషివరా! సూర్య శాప కారా! పితృ శాప నకుల జన్మకా
జమదగ్ని రిపు కార్తవీర్యార్జున సుత హత పితరా! నమస్తే నమః"

ঌ ❖❖ ❖ ও

1. భారతము, బ్రహ్మపురాణము

# 4. దత్తాత్రేయమహర్షి

## 1. దత్తాత్రేయుని జననము

పూర్వము కౌశికుడను బ్రాహ్మణుని పత్ని సూర్యోదయమై నంతనే తన భర్త మరణించునని తెలుసుకుని తన పాతివ్రత్య మహిమచే సూర్యోదయము కాకూడదని శాసించెను. అంత సూర్యుడుదయింప కున్న సమయమున లోకములన్నియు తల్లడిల్లెను. చివరికి దేవతలందరు అత్రిమహర్షి భార్యయైన పతివ్రత శిరోమణి అనసూయను శరణువేడగ ఆమె కౌశికపత్నిని శాంతింపచేసి ఆమె భర్తను బ్రతికించి అతనిని నవయవ్వనునిగ చేసెను.

అనసూయ యొక్క మహాత్మ్యమునకు మెచ్చుకొని త్రిమూర్తులు అగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మీకు ఏమి వరము కావలయునో కోరుకొన మని పలికెను. అంత ఆమె మీరు మువ్వురును పరమయోగ్యులైన కుమారునిగ నా కడుపున పుట్టవలయునని కోరెను. ఆమె కోరికకు సరి అని అంగీకరించి వారు మాయమయ్యెను.

ఇట్లుండ కాలానుసరణముగ అత్రిమహర్షి పుత్రకాంక్షచే గొప్ప తపస్సు చేయగ త్రిమూర్తులు దర్శనమిచ్చి అనసూయ కోరిన కోరికను తామిచ్చునట్లుగ పలికిరి. చివరకు అత్రిమహర్షి వీర్యరూపమున విష్ణువు యొక్క అంశ అనసూయ గర్భమున ప్రవేశించగ జన్మించిన వాడే దత్తాత్రేయుడు.

## 2. దత్తాత్రేయుని ప్రవర్తనము

ఒకానొక సమయమున ధర్మము నశించి దుర్మార్గుల దురాచారము లతో వర్ణసంకరము అయ్యెను. బ్రాహ్మణ క్షత్రియులు యజ్ఞాదికములను మాని భ్రష్టులై యోగశాస్త్రము క్షీణించెను. రాక్షసులు దుర్మార్గులై ప్రవర్తించు చుండిరి.

ఇట్లుండ దత్తాత్రేయుడు జనించి బాల్యము నుండియు పరమ యోగిగ నిస్సంగిగ బాహ్యేంద్రియ నిగ్రహుడుగ నిరంతర ఆత్మానంద తన్మయుడుగ కాలము గడుపుచు తల్లిదండ్రులను సంతోషము పెట్టు చుండెను. దత్తాత్రేయుని తోటి మునిబాలురందరును ఎల్లప్పుడు ఇతని దగ్గరే ఉండిరి. కాని ఏకాంతముగా నుండెడి దత్తాత్రేయునికి తన స్వేచ్ఛా ప్రవర్తనకు వీరందరు అడ్డుతగులుచుండిరి. ఎల్లప్పుడు ఏకాంతమును కోరుకొనెడి దత్తాత్రేయుడు వారితో కలియడము ఇష్టములేక వారినెట్లైనను తప్పించుకొనవలయునని ఒక కొలనులో దాగుకొనెను. కాని ముని బాలురు ఆతనిని వదలక ఆ కొలని తీరప్రాంత మందే నిలిచియుండిరి. వెంటనే ఆతని సంకల్పమాత్రమున అతడు విష్ణ్వంశతో జనించినవాడు కావున సంకల్పమాత్రమున లక్ష్మి అతని చెంతకు చేరగ దత్తాత్రేయుడు ఆమెతోకూడగ కొలని బయటకు వచ్చెను. అంత ఋషిబాలురు అతనిని పలువిధముల కీర్తించిరి.

అటుపై దత్తాత్రేయుడు లక్ష్మిని తనతొడపై కూర్చుండపెట్టుకొని మద్యపానము చేయుచు ఆటలాడుచు పాటలుపాడుచు ఆమెతో కామ కలాపములు ఆడుచుండెను. అది చూసిన ముని బాలురు అతనిని అసహ్యించుకొని అతనిని వదలివెళ్ళిరి.అటుపై దత్తాత్రేయుడు ఆంత రంగికముగ తపోధ్యానపరుడై బహిరంగముగ మద్యపానము చేయుచు స్త్రీలోలుడైనట్లు నటించుచు కాలము గడుపుచుండెను. కాని మహా

యోగులకుతప్ప ఇతరులకు ఇతని మహాత్మ్యము తెలియరాకుండెడిది. యోగులైనవారికి హవ్యసేవనాసవసేవలు సమానమని సామాన్యులకు తెలియగలదా? యోగినెరుగుట యోగికే సాధ్యముకాని ఇతరులకు సాధ్యముకాదు గదా![1]

### 3. దత్తాత్రేయుడు జంభాది రాక్షసులను చంపించుట

ఒకానొకసారి జంభాది రాక్షసులు ఇంద్రాదులపై దండెత్తి దేవతల నోడించుచుండిరి. ఇట్లు ఒకసంవత్సరకాలము ఎంత పోరాడినను దేవతలు రాక్షసులను జయింపలేక చివరకు వాలఖిల్యాది మహర్షులతో కూడి తమ గురువగు బృహస్పతి చెంతకు చేరి జంభాది రాక్షసులను జయింప ఉపాయమును ఆలోచింపసాగిరి.

అంత బృహస్పతి ''ఓ ఇంద్రాది దేవతలారా! అత్రిమహర్షి కుమారుడు దత్తాత్రేయుడను మహాత్ముడు కలడు. మీరు భక్తితో అతనిని సేవించినచో అతడు మిమ్ములను ఆదుకొనగలడు'' అని బృహస్పతి దేవతలతో చెప్పెను. ఆ మాటలు విన్న దేవతలు వెంటనే దత్తాత్రేయుని ఆశ్రమమునకు వచ్చిరి. వారు వచ్చిన సమయమున దత్తాత్రేయుడు కిన్నెరల తోను, గంధర్వులతోను చుట్టూ కూడియుండి మిగుల తేజస్సుతో లక్ష్మీదేవి తనతో కూడియుండగ బాగుగ ప్రకాశించుచుండెను. కాని ఆ సమయమున దత్తాత్రేయుడు వెకిలి చేష్టలు చేయుచు మద్యము తెమ్మని వారికి సైగ చేసెను. ఆతడు లక్ష్మితో కూడి ఆ మద్యమును తాగి గంతులు వేయుచు పారిపో జొచ్చెను. కాని ఇంద్రాది దేవతలు అతనిని వదలక వెంబడించిరి.

చివరికి దత్తాత్రేయుడు వారిని కరుణించి మీరు ఏ పనికై ఇచటకు వచ్చిరి అని పలుకగా వారు జంభాది రాక్షస వృత్తాంతము చెప్పి వారినుండి మమ్ములను కాపాడమని ప్రార్థించిరి.

1. ఈ వృత్తాంతము మనకు మార్కండేయ పురాణమున కలదు.

కానీ వారి మాటలు విన్న దత్తాత్రేయుడు మొదట అంగీకరించక "నేను మద్య ఆసక్తుడను, స్త్రీలోలుడను, కర్మభ్రష్టుడను ఉన్మత్తుడను. నేను ఆ రాక్షసుని జయించలేను మీరు ఇచటనుండి వెళ్ళండి" అని పలికెను.

అంతట వారు "ఓ మహాత్మ! నీవు విష్ణుడవు, ఆద్యుడవు (అందరి కంటె సృష్టిలో మొదటి వాడివి) నీతో ఉన్న ఈమె లక్ష్మీదేవి. నీవు సత్య జ్ఞాన ఆనంద స్వరూపుడవు. నీకు నియమనిభందనలు లేవు. నీకంటె సర్వ సమర్థుడు ఎవరును లేరు. కాన మమ్ములను రక్షింపుడు" అని దేవతలు మరల ప్రార్థించిరి. అంత దత్తాత్రేయుడు వారిని కరుణించి "నన్ను మీరు తెలుసు కొంటిరి. నాకు దేవతలకు మేలు చేయుట కంటే నాకు కావలసినది ఏమున్నది. కావున మీరు ఆ రాక్షసులను యుద్ధ కారణముగ ఇచ్చటికి తీసుకొని వచ్చినచో నేను ఒక క్షణ కాలములో వారిని పరిమార్చెదను" అని పలికెను. అంత దేవతలు పరుగు పరుగున వెళ్ళి జంభాది రాక్షసులను తోడ్కొని వచ్చిరి.

జంభుడు సైన్యముతో కూడినవాడై దత్తాత్రేయుని ఆశ్రమము నకు వచ్చెను. దత్తాత్రేయుని ప్రక్కన కూర్చుని ఉన్న లక్ష్మిని చూసి కామమోహితుడై ఆమెను దొంగలించి తన సిబికలో ఎక్కించుకొని తోడ్కొని పోజూసెను. ఆ సమయమున దత్తాత్రేయుడు ఇంద్రాదులను పిలిచి లక్ష్మి రాక్షసుల శిరస్సు ఎక్కినది. ఇంకా వారికి నాశనము సంభవించినట్లే. దాని వలన వారందరు బలహీనులగుదురు. ఇక మీరు వెంటనే యుద్ధము ప్రారంభించి వారిని చంపివేయుడు అని వారికి దత్తాత్రేయుడు సూచన గావించెను.

దత్తాత్రేయుని సూచనను గైకొనిన దేవతలు పూర్వము వలె గాక ధైర్యముతో ఆ జంభాది రాక్షసులనందరిని చంపి సంతసముగ దత్తాత్రేయుని స్తుతించి తిరిగి స్వర్గలోకమునకు బయలుదేరి వెళ్ళిరి.

## 4. దత్తాత్రేయుడు కార్తవీర్యార్జునుని కటాక్షించుట

పూర్వము హైహయ వంశీయుడగు కార్తవీర్యార్జునుడు అను రాజు తండ్రి మరణానంతరము సింహాసనమును అధిష్టించి రాజ్యమును పరిపాలింప ఇష్టములేక మంత్రులను పిలిచి మంత్రులార ఈ రాజ్యము నాకక్కరలేదు. పరస్పర ద్వేష తస్కరాది భాదలనుండి కాపాడుటకై ప్రజలు ధరణీపతికి ధనము చెల్లింతురు. నేను ఆ పనులు చేయజాలను. వనమునకు పోయి తపము ఆచరించి ఆధ్యాత్మయోగ సిద్ధినిపొంది వచ్చెదను అని పలికెను.

ఆ మాటలు విన్నవారిలో గర్గుడను మంత్రిపుంగవుడు లేచి రాజుమాటలాలకించి అతని మనోభిప్రాయమును మార్చ ప్రయత్నించి విఫలుడై చివరికి రాజును చూసి "రాజ! దత్తాత్రేయుడను మహర్షి మహా యోగసంపన్నుడు. అతని కృప గాంచినచో నీ అభిమతము సిద్ధించును" అని చెప్పి దత్తాత్రేయుని కటాక్షమున ఇంద్రుడు జంభాది రాక్షసులను చంపిన వృత్తాంతమును తెలిపెను. అంత కార్తవీర్యార్జునుడు గర్గుని మాట లను విని ఆనందపడి వెంటనే దత్తాత్రేయుని ఆశ్రమమునకు వెళ్ళి అతనికి సకల సేవలు చేయుచు కాలము గడుపుచుండెను. దత్తాత్రేయుడు కార్తవీర్యార్జునుని భక్తిని పరీక్షించదలచి అతనికి అనేక విధాలుగా కష్టాలు పెట్టెను. అయినను తన భక్తివిడువక పరమానందముతో కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయునికి సేవచేయుచుండెను.

అంత దత్తాత్రేయుడు"ఓరి! నేను స్త్రీ లోలుడను. మద్యపానము సేవించువాడను. ఇటువంటి నన్ను ఏల సేవింతువురా!" అని కార్తవీర్యార్జు నుని ఉద్దేశించి పలికెను. అంతట ఆతడు "స్వామీ! నీవు అంతఃశుద్ధుడవు, అసంగుడవు, సాక్షాత్తు విష్ణుమూర్తివి. ఆమె లక్ష్మీదేవి" అని చేతులు జోడించి సంస్తుతించెను.

అటుపై దత్తాత్రేయుడు ఆతని భక్తికి సంతోషించి ఏమి కావలయునో కోరుకొనమనెను. అంత కార్తవీర్యార్జునుడు "వేయి హస్తములు, సమస్తభూమి పాలనా సామర్ధ్యము, సంగర విజయము, సిరి సంపదలు, ధర్మతత్పరత, బుద్ధి, శైలములందు, ఆకాశమునందు, జలము లందు, భూమియందు, పాతాళములయందు తన రథము అకుంఠితముగ నడుపు శక్తి" కోరుకొనెను. దత్తాత్రేయుడు వానికి ఆ వరములన్నియు ఒసగి అంతర్ధానమగుచు "ఓయి! నీ రాజ్యములందెల్లెడల నీ బాహుశక్తి మూలమున ధర్మ ప్రతిష్ఠాపన చేయుము. యజ్ఞయాగాదులు చేయు బ్రాహ్మణులకు సమస్తము ఇచ్చుచుండుము. నా యొక్క భక్తి యోగములు అన్ని చోట్లయందును చాటుచుండుము. నీవు ఎప్పుడైతే మహర్షులను భాదించెదవో ఆనాడే నీవు మరణించెదవు" అని హెచ్చరించి వెడలిపోయెను. కార్తవీర్యార్జునుడు ఆ వరములను పొంది బ్రహ్మానందముతో అనంతబల సంపన్నుడై మాహిష్మతీ పురమునకు పోయి రాజ్యమును స్వీకరించెను. అది మొదలు కార్తవీర్యార్జునుడు ధర్మబద్ధముగా భూమి పరిపాలన చేయుచు అనేక యజ్ఞములు చేసెను. బ్రహ్మర్షి పూజలు చేసి ధర్మమును పూర్వస్థితికి తీసుకొని వచ్చెను. తన బాహుబలమున భూమండల మంత జయించి అందు ధర్మకార్యంబు చేయుచు బ్రాహ్మణులను గౌరవించు చుండెను. ప్రతినిత్యము దత్తాత్రేయుని పూజించుచు ఆతనికి కృతజ్ఞుడై యుండెను. చివరకు దత్తాత్రేయ మహర్షి చెప్పినట్లే నీవు ఎప్పుడు మహర్షులను భాదింతువో ఆరోజు మరణింతువు అన్నట్లు జమదగ్ని మహర్షిని అన్యాయముగా భాదించి పరశురాముని చేతిలో చనిపోయెను.

### 5. దత్తాత్రేయుడు అలర్కునకు జ్ఞానము బోధించుట

మదాలస, ఋతుధ్వజుల పుత్రుడగు అలర్కమహీపతి రాజ్యము చేయుచు పురుషునకు ముముక్షము(ముక్తి) పోలిన వస్తువు మరొకటి

లేదనియు దానిని పొందుటకు సత్సాంగత్యము (సజ్జనులతో కలయిక) చేయుటదప్ప మార్గాంతరము లేదని నిశ్చయించుకొనెను. ఇలాఉండగా ఒకనాడు విరాగియై అడవులనున్న అతని అన్న ఆ సమయముననే కాశీరాజు దగ్గరకు వెళ్ళి తన రాజ్యము తన తమ్ముడు అపహరించినాడని అది తనకిప్పించమనియు కోరుకొనెను.

అంత కాశీరాజు సైన్యముతో కూడి దండెత్తి సామదానభేద దండో పాయముల ఆతని జయింప ప్రయత్నించెను. ఈ సమయములో అలర్కుడు దత్తాత్రేయుని సమీపించి దండప్రణామములు ఆచరించి ఆతనిని శరణు కోరెను. అటుపై దత్తాత్రేయుడు అతనిని కరుణించి "ఓరి! వివేక హీనుడ! నిన్ను నీవు తెలిసికొనుము. అంగముల చింతించి అంగి చూచి నిరంగుని కనుగొని అసంగుడవై సర్వాంగములనుడుగు మని" అతనికి తత్త్వజ్ఞానో పదేశముచేసి ఇక విచారమేమని అడిగెను.

అలర్కుడు సమ్యగాత్మదర్శనుడై దత్తాత్రేయునికి వందన మాచరించి "నీకృపచే బ్రతికితిని. సుస్థిర జ్ఞానమును ఉపదేశింపుము" అని వేడుకొనెను. అంత దత్తాత్రేయుడు "మమ అనుట దుఃఖమునకును నమమ అనుట నిర్వృతికిని మార్గము. అహంకారమను అంకురముచే పుట్టి మమకారమను మొదలు కలిగి గృహము క్షేత్రమునను కొమ్మల నంది పుత్రులు భార్యయను పల్లవముల నొప్పి ధనముధాన్యము నను పెద్దయాకులు వేసి పుణ్య పాపములను పుష్పముల బూచి సుఖదుఃఖములను పండ్లుకాచి చిర కాలము పెరిగి యజ్ఞానమను కుదుళ్ళతోనిండి ముక్తిమార్గమును గప్పివేసి యున్న మమ అను వృక్షమునీడను సంసారపథపరిశ్రాంతులగు మిథ్యాజ్ఞాన సుఖాధీనులకు పరమ సుఖము పరమదుర్లభము. కావున ఈ మహా వృక్షమును విమల విద్యయను గొడ్డలి తీసికొని తత్త్వనిధులు సాధుజనులు వీరితోడిసంగ మను పాషాణమున బాగుగా నూఱి పదను పెట్టి ఎవరు

నఱకుదురో వారు చల్లని బ్రహ్మవనము చొచ్చి నిత్యానందులై యపునరావృత్తి నుందురు" అని ఉపదేశింపగా విని అలర్కుడు ఆనందించెను.

అంత అలర్కుడు "మహాత్మా! ఇక నిర్గుణ బ్రహ్మైకత్వమును బోధించు యోగమును తెలుపుము" అని వేడుకొనెను. అంత దత్తాత్రేయుడు "వత్సా! శరీరమునందలి పరమజ్ఞానమునకు గురువే ఉపద్రష్ట. మోక్షార్థికి యోగము జ్ఞానపూర్వకమగును. ప్రకృతి గుణములతో నేకత్వము లేకపోవుటయు బ్రహ్మైకత్వము కలుగుటయు ముక్తియన నొప్పును. ఆముక్తి పరమయోగమునఁ గలుగును. యోగము సంగత్యాగము వలన సిద్ధించును. సంగత్యాగము వలన నిర్మమత్వము వలన సిద్ధించును. సంగత్యాగము వలన నిర్మమత్వము దాని వలన వైరాగ్యము దానివలన జ్ఞానము దాని వలన మోక్షమును సంభవించును."

1. యోగికి ముందు ఆత్మ జయము కావలెను. కనుక ప్రాణాయామముచే అతడు ఆత్మ దేహ దోషము దహింప చేయవలె.
2. కామజములైన కర్మములు యోగవిఘ్న కార్యములగుట యోగి వానిని త్యజించి సుద్ధాత్ముడై పరమాత్మునిలో ఐక్యమైపోవును.
3. అట్టి యోగికి గౌరవమే విషము. అవమానమే అమృతము. కావున ఆ యోగి తనకు ఉన్నదే ఇల్లుగ తన ఆకలికి దొరికినదే భోజ్యముగ తనకు కలదియే ధనముగ సంతోషమును పొంది మమకారమును పొందడు. కావున నీవు విచారించక యోగపురుషుడవై మోక్షవృత్తిని మరువకుము.

అంత అలర్కుడు బ్రహ్మానందముతో ఇంటికి వెళ్ళి ప్రీతిపూర్వకముగ తన రాజ్యమును కాశీ రాజుకిచ్చెను. దానిని కాశీరాజు అలర్కుని అన్నకు ఈయబోయెను. కాని అలర్కుని అన్నయు ఆనందించి తాను సోదరునకు జ్ఞాన ప్రబోధము చేయుటకే రాజ్యమును కోరితిననియు నాపని అయిపోయి నది కావున రాజ్యము అక్కరలేదనియు కాశీరాజునకు తత్త్వమును ఉప

దేశించి తన ఆశ్రమమునకు వెడలిపోయెను. కాశీరాజు అలర్కుని పూజించి రాజ్యమతనికి విడిచి వెళ్ళెను. అలర్కుడు తన కుమారునికి రాజ్యపట్టాభిషేకము చేసి అడవికి వెళ్ళి యోగియై విరాగియై ఆత్మసుఖమును పొందెను[1]. దత్తాత్రేయమహర్షి సంగమును విడనాడుటకై వివిధ వేషములను పొందెడివాడు. విల్లునమ్ములుకోని వేటకుక్కలు వెంటరాగ చెంచువానివలె నుండువాడు. కారడివిలో కిరాత యువతి యుండెడిచోట నుండి మద్య మాంసములు సేవించెడివాడు. మాలపల్లి కేగి చండాలురతోకూడి మద్యమునుగ్రోలువాడు. ఉన్మత్తుడైనట్లు విహరించెడివాడు. అయినను ఆతడు మహా యోగీశ్వరేశ్వరుడు. విచిత్రచరిత్రుడు.

శ్లో॥ "విభుర్నిత్యానంద శ్రుతిగణశిరోవేద్యమహిమా
యతో జన్మాద్యస్య ప్రభవతి స మాయాగుణవతః
సదాధార స్సత్యో జయతి పురషార్థైక ఫలదః
సదా దత్తాత్రేయో విహరతి ముదా జ్ఞానలహరిః"

**దత్తాత్రేయమహర్షి స్తుతి**

"అత్రి అనసూయ పుత్రా! దత్తాత్రేయ నామా! దేవహుతి కర్దమ దౌహిత్రా!
అత్రి వంశోద్ధారా! బ్రహ్మవిష్ణుమహేశ్వర రూపా! జంభాది రాక్షసాంతకా!
దత్తాత్రేయా! అలర్క జ్ఞాన ప్రబోధా! కార్తవీర్యార్జున కటాక్ష రక్షకా!
దత్తాత్రేయ జ్ఞాన కోవిదా! తవ పాదపంకజ స్మరామి నమస్తే నమః"

ఐ ❖❖ ❖ ఙ

1. ఈ విషయము మనకు మార్కండేయపురాణమున కలదు.

# 5. దధీచిమహర్షి

## 1. దధీచి జననము

చ్యవనమహర్షి అశ్వినుల నెపమున సుకన్య పాతివ్రత్య ప్రభావముచే నవయవ్వనుడైనాడు. అలాగే త్రిలోకసుందరుడయ్యాడు. ఒకానొకనాడు సుకన్యను పిలిచి ఓ సాధ్వి నీవు చేసిన త్యాగము అనంతము. గుడ్డివాడిని ముసలివాడిని అయిన నన్ను వివాహము చేసుకొంటివి. కాని నీ ప్రాతివ్రత్య మహిమచే నేను నవయవ్వనుడనైతిని. కావున మహాత్యాగి పరమత పోధనుడు అయిన కుమారుడు పుట్టును అని వరమిచ్చెను. అటుపిమ్మట ఆమె కోర్కెను తీర్చగా ఒక మంచి సుముహూర్తమున ఒక కుమారుని కనెను. అతడే దధీచి మహర్షి.

## 2. దధీచికి సారస్వతుడు జనించిన విషయము

దధీచి బాల్యమునుండియు గొప్పతపస్సు చేసెడివాడు. సరస్వతీనది తీరమున ఆశ్రమమును నిర్మించుకొని తన తపఃశక్తిచే దివ్యతేజోభరితుడై ప్రకాశించుచుండగ సరస్వతీనదియు అతనిని చూచి ఆనందపడెను. అంతట ఇంతటి తేజస్సుతో ప్రకాశించెడి ఆ దధీచిని ఇంద్రియ నిగ్రహము లేని వాడుగ అతని తపస్సును విఘ్నము చేయుటకై ఒక అప్సరసను అతని దగ్గరకు పంపెను.

అంతట దధీచి మహర్షి సరస్వతీనదిలో స్నానము చేసి, నీటిలో నిలచి జపము చేసుకొనుచుండగ 'అలంబుస' అను అప్సరస తన నృత్య గీతాలాపములచే అతని మనస్సును చూరగొనెను. దధీచుడు కామ

మోహితుడు కాగా అతని వీర్యము స్కలనమై నదిలో పడెను. సరస్వతీనది సంతసముతో స్త్రీరూప ధారిణియై ఆ వీర్యమును తన గర్భమున ధరించి గర్భవతి అయ్యెను. అంతట సరస్వతి కాలక్రమేణ పుత్రునికని దధీచి వద్దకు తీసుకొని వెళ్ళెను. దధీచి దివ్యదృష్టితో చూచి సరస్వతి వలన పుట్టుటచే ఆతనికి 'సారస్వతుడు' అని పేరు పెట్టెను. సరస్వతి ఆ కుమారుని తీసుకొని పెంచమని అడుగగ దధీచి "నేను తపోవ్రతుడను కావున నీవే ఈ కుమారుని రక్షింపుము. భవిష్యత్తులో క్షామకాలమున మహర్షులను ఇతడు రక్షించును" అని పలికెను. అంతట సరస్వతి ఆ కుమారుని పెంచి పెద్ద చేసెను. దధీచి చెప్పినట్లే క్షామకాలమున మహర్షులను ఆహ్వానించి వారందరికి విందు భోజనములు పెట్టి క్షామనివారణను కావించెను.

### 3. దధీచికి ఇంద్రుడు నేర్పిన శాస్త్ర వృత్తాంతము

ఒకప్పుడు ఇంద్రుడు దధీచి కడకు వచ్చి "ఓ ఋషి సత్తమా! నీవు మహాత్ముడవు కావున నీకు మహోత్తమ శాస్త్రములను ఉపదే శించెదను" అని చెప్పి ఉపదేశించెను. చివరికి అతడు అంతర్హితుడు అగుచూ చివరికి ఈ విధంగా చెప్పెను. "నీవు ఎవ్వరికైననూ ఈ శాస్త్రములను ఉపదేశించినచో ఆనాడే నీ శిరస్సును ఖండించెదను" అని హెచ్చరించెను.

అంతట ఒకానొకనాడు అశ్వినీదేవతలు ఈ విషయమును గ్రహించి దధీచి వద్దకు వచ్చి "ఓ ముని సత్తమా! పూర్వము నీ తండ్రియగు చ్యవన మహర్షికి నవయవ్వనమును ఇచ్చిన అశ్వినీ దేవతలము మేము, నీవు ఇంద్రుని వలన తెలుసుకొన్న శాస్త్రములను మాకు ఇచ్చినచో మేము నీకు ఉపకారము చేయగలము కావున ఆ శాస్త్రములను మాకు ఉప దేశింపమని" పలికెను. కాని దధీచి తనకు ఇంద్రునిచే కలిగిన శాపవృత్తాంత మును చెప్పెను. కాని అందుకు వారు "నీకెట్టి ఉపద్రవములు వచ్చినను నిన్ను కాపాడు బాధ్యత మాది. మేము దేవహితార్థమై నిన్ను అర్థించుచున్నాము" అని బతిమాలెను.

అటుపై దధీచి అంగీరింపగా వారు ఒక గుర్రపు తలను తీసుకొని వచ్చి దధీచి తలతీసి ఆ గుర్రపు తలను దధీచి మొండెమునకు అతికించి దానివలన శాస్త్రములు గ్రహించి ఆతని తలను భద్రపరిచిరి. ఇంద్రుడు దధీచి చేసిన పనికి వగచి వెంటనే ఆయుధముతో వచ్చినవాడై దధీచి శిరస్సును నరికి వెడలిపోయెను. అటుపై అశ్వినీ దేవతలు వచ్చి దధీచియొక్క పూర్వశిరమును యథాప్రకారముగ దధీచికి అతికి ఆతని పునర్జీవితునిచేసి వెడలిపోయిరి[1].

## 4. దధీచి-క్షుపుల పరస్పర వైరము

అశ్వినీ దేవతలచే పునర్జన్మను పొందిన దధీచిమహర్షి ఒకానొకనాడు అతనికి బాల్యహితుడైన క్షుపుడు అను రాజుచే ఆహ్వానింపబడినవాడై అతని ఇంటికి వెళ్ళెను. క్షుపుడు అతనిని తగిన రీతితో సన్మానించెను.అటుపై కొంతసేపటికి ఒక వివాదము చర్చనీయాంశముగ కలిగెను. అది ఏమనగా వర్ణాశ్రమధర్మములలో బ్రాహ్మణుల ఆధిక్యమా లేదా క్షత్రియ ఆధిక్యమా అని తీవ్ర విమర్శలతో వివాదము చెలరేగెను.

చివరకు ఇది ఒక కీలక ఘట్టములో ఒకరికొకరు కోపోద్రిక్తులై పోరాడుకొనజొచ్చిరి. దధీచి ముక్కోపియై క్షుపుడిని పొడవగా క్షుపుడు గొప్ప ఆయుధముతో దధీచిని ముక్కలు ముక్కలుగా చేసి సంహరించెను. ఇంతలో రాక్షసగురువైన శుక్రాచార్యుడు అక్కడకు వచ్చి దధీచి భార్గవవంశమున పుట్టినవాడగుడచే అతడు తన సంజీవని మంత్ర ప్రభావమున అతని దేహపు ముక్కలన్నింటిని ఒకచోట జేర్చి ఒక క్షణకాలములో బ్రతికించెను. దధీచి నిద్రనుండి మేల్కొన్నట్లుగా లేచి భార్గవునకు అనేక నమస్సులు అందించెను. అంత శుక్రుడు దధీచిని చూచి "ఓ వత్సా! నీవు సదాశివుని

1. ఇది బ్రహ్మ పురాణము, స్కాందపురాణమున కలదు.

గూర్చి తపస్సు చేయుము. నీవుసర్వశక్తిసంపన్నుడవు అగుదువు" అని దీవించి తాను మాయమయ్యెను.

**5. దధీచి క్షుపుని విష్ణుని నిందించి గెలుచుట**

దధీచి శుక్రాచార్యుని ఆశీర్వాదమును పొంది ఆశ్రమమునకు వెళ్ళి శివుని గూర్చి ఘోరతపస్సు చేసెను. అతని తపోమహిమకు మూడు లోకములు దద్దరిల్లెను. అతని తపస్సునకు మెచ్చి చివరకు సదాశివుడు ప్రత్యక్షమై వరుసగ మూడు వరాలను ఇచ్చెను. 1. స్వచ్ఛంద మరణము 2. వజ్రమయ శరీరము 3. లోకత్రయ విజయ శక్తి.

పై విధముగ వరములను పొందిన దధీచుడు, క్షుపుడు తనకు చేసిన అవమానమును, బ్రాహ్మణనిందను మరువజాలక ఆతని గృహము నకు పోయి క్షుపుని ఒక కాలితో తన్నెను. క్షుపుడును మహా కోపముతో దానికి ధీటుగ ఎన్నో శస్త్రాస్త్రములను ప్రయోగించినను లాభములేకపోయెను. అంత దధీచి గర్వించినవాడై "ఓరీ! క్షత్రియ అధముడైన నీవు ఎక్కడ బ్రాహ్మణ శ్రేష్ఠుడనగు నేను ఎక్కడ. బ్రాహ్మణుడు అధికుడగునో కాదో తెలిసినదా? నీవే కాదు నీ దేవుడగు మహావిష్ణువు కూడా నా కాలి గోటికి సరిరారు" అని పలికెను. అంత క్షుపుడు చేయునది లేక విష్ణుమూర్తిని గూర్చి తపస్సు చేసెను. చివరికి విష్ణుమూర్తి ప్రత్యక్షమయ్యెను.అంత జరిగిన వృత్తాంతమును విష్ణువుకి చెప్పి తనను రక్షింపమని కోరెను. అంత విష్ణుమూర్తి క్షుపుని వెంటకొని దధీచి దగ్గరకు వెళ్ళి "ఓరి! శివగర్వితుడవైతివా. నేనును శివుడును ఒక్కరము కాదా" అని అడిగెను. అంత దధీచి వెకిలి నవ్వులు నవ్వి "నీవు ఎక్కడ శివుడు ఎక్కడ. శివ భక్తుడను అయిన నా గోటికైనను నీవు చాలవు. ఇక నీవు శివునితో పోలగలవా" అని పరిహాసము చేసెను.

అంత విష్ణుమూర్తి దధీచి శిరమును ఛేదింప చక్రమును పంపెను. దధీచి తన తపః శక్తిచే చక్రమును నివారించెను. విష్ణుమూర్తి మాయను

పన్నెను. దధీచి మాయను ఛేధించెను. చివరికి విష్ణుమూర్తి "వత్సా దధీచీ! నీ భక్తి తత్పరతను పరీక్షింప ఇటువచ్చితిని. నిజముగ నా భక్తశ్రేష్ఠుడవగు నీ వంటి వాని కాలి గోరితోనైనను పోలగల వాడెవడు. నీవు దేవ హితార్థమై జీవింపుము" అని పలికి క్షుపుని చూచి "ఆతని శరణు జొచ్చుటకంటే వేరే ఉపాయము లేదని" అతర్ధానుడయ్యెను.

అటుపై క్షుపుడు దధీచి పాదములపై పడి "ఓ మహాత్మా! నీ శక్తి తెలియక నీకు ఇబ్బందిని కలిగించితిని. నా తప్పును క్షమించుము" అని అనేక విధముల ప్రార్థించెను. దధీచుడు శాంత చిత్తుడై "మిత్రమా! నీపై నాకు ఎట్టికోపము లేదు. బ్రాహ్మణులకోపము నీటిపైగీత క్షణికములే కదా! కావున నీవు యథాప్రకారముగ నా ప్రియమిత్రుడవై ఉండుము" అని అతనిని ఓదార్చి పంపివేసెను.

ఈ విధముగ తపోమహిమ కలిగినవాడు ఈశ్వర వరశక్తి సంపన్నుడు అయిన దధీచిమహర్షి శిష్య ప్రశిష్యులను చేర్చుకొని ధర్మసంరక్షణార్థము 'ఘభిస్తిని' అను నామాంతరముగల సువర్చా అను కన్యను పరిగ్రహించి గృహస్థ జీవనమును మహా ఆదర్శముగ గడుపుచుండెను. సువర్చయు మహా సాధ్విగ పతిపాదపద్మ సేవ తప్ప ఇతరములను ఎరుగకుండెను. దధీచికి అనతికాలములోనే కోటానుకోట్ల ఋషులు శిష్యప్రశిష్యులైరి.

**6. దధీచి దక్షుని శపించుట**

ఒకానొకనాడు దక్షప్రజాపతి యజ్ఞము చేయదలచి దధీచి మహర్షిని శిష్యసమేతముగా రావలెనని కబురు పంపెను. దధీచి మిగుల ఆనందముతో తన శిష్యగణముతో కూడి దక్షయజ్ఞమునకు బయలుదేరి వెళ్ళెను.

దక్షుడు తన చెంత చేరిన దధీచికి అనేక సపర్యలు చేసి చివరిలో ఒక మాటను పలికెను. "ఓ మిత్రమా! శివుడును శివఅనుచరులును

రాకుండగ చేసి నేను యజ్ఞమును నిశ్చయించితిని. జగద్రోహి అగు శివుని పిలువకుండుట నీకు సంతోషమైనచో ఇక్కడ ఉండి యజ్ఞమును జరిపింపమని" పలికెను. అంత కోపోద్రిక్తుడైన దధీచి తోకత్రొక్కిన పామువలె లేచి వశిష్ఠ, వామదేవ, భాస, నారదాది మహర్షులెల్లరూ రాకుండుటకు అదియే కారణమని తెలుసుకొని, "ఓ దక్షప్రజాపతి! నీకు ఈ దుర్బుద్ధి ఏల పుట్టినది. విశ్వేశ్వరుడు, దేవాదిదేవుడగు శివుడు లేనిదే యజ్ఞమెట్లు జరుగును. జరిగినను నీకు లభించు ఫలితము ఏముండును" అని శివుని అనేక విధముల ప్రస్తుతింప మొదలిడెను. అంత దక్షుడు దధీచి మాటలను లెక్క చేయక శివుని తక్కువదనముచేసి అనేక విధముల నిందించెను. శివుడు స్మశానవాసి, దిగంబరుడు, గజచర్మధారుడు, బిచ్చగాడు, శశశృంగుడని అనేక విధముల దూషించెను. కాని దధీచి సభలో కూర్చున్న వారందరు వినుచుండగ మిక్కిలి ప్రశాంత హృదయము కలవాడై వాటన్నింటికిని సముచితముగ బదులు చెప్పి పరమ శివుని గొప్పతనమును అనేక విధముల విస్తరించి చెప్పెను.

దధీచి చెప్పిన మాటలన్నింటినీ లెక్కచేయక మిగుల గర్వించినవాడై దక్షుడు ఆ నిర్భాగ్యుని పొగడిన వారు ఇచ్చట ఒక్క నిముషమైనను ఉండ కూడదని ఆజ్ఞాపించి దధీచిని అవమానపరిచెను. అంత దధీచి శిష్యసహితుడై లేచి, "ఓరి మూర్ఖుడా! నేను ఎన్ని చెప్పిననూ వినక ప్రగల్భములను పలుకుచున్నావు. సదాశివుని దూషించుచున్నావు. కావున నీవు చేసిన యజ్ఞము అశుభమగుగాక! నీవు తగిన ప్రాయశ్చిత్తమును పొందెదవు. తెలివి మాలిన వాడవై నీవు చేయు యజ్ఞమునకు వచ్చిన దేవతలు ఋషులు మొదలగువారు అందరు వినాశనము అగుదురుగాక!" అని శపించి ఆ యజ్ఞప్రదేశము నుండి వెడలిపోయెను. అటుపై దధీచి శాప ప్రకారమే దక్షుని యజ్ఞము అచిరకాలములోనే వీరభద్రునిచే దక్షయజ్ఞ వినాశనము సదస్సుల వినాశనము కలిగెను.

## 7. దధీచి దేవతల అస్త్రశస్త్రములను మ్రింగుట

ఒకానొక సమయమున రాక్షసులు విజృంభించి దేవతలపై దండెత్తి వారిని ఓడించి ఇక ఎన్నడునూ తమకు అపకారం చేయక వీలుపడకుండు నటుల వారి అస్త్రశస్త్రములను లాగుకొనుచుండెను. అంత దేవతలు ఒక ఉపాయమును ఆలోచించి దధీచిమహర్షి దగ్గర తమ అస్త్రములను దాచియుంచినచో ప్రమాదము ఉండదని తలంచి ఇంద్రాదిదేవతలు అందరునూ తమ అస్త్రశస్త్రములను దధీచివద్ద పెట్టుకొనమని అతని పాదములపై పడి ప్రార్థించెను.

దధీచి దయార్ద్ర హృదయుడై అంగీకరించి అస్త్రములను గ్రహించెను. దేవతలును ఆనందముతో అచటనుండి వెడలిపోయెను. దేవతలకు రాక్షసుల ఉపద్రవము తొలగిపోయెను. కాని ఎన్నినాళ్ళయినను దేవతలు వచ్చి ఆయుధములను తీసుకొనజాలక ఉండిన సమయమున దధీచి ఆ ఆయుధములపై నీటిని అభిమంత్రించి ఒక్కసారిగ మ్రింగివేసెను. దధీచి యొక్క తపః ప్రభావమున అవి జీర్ణమై ఆతని రక్త నాళములలో చేరిపోయెను.

అటుతరువాత కొంతకాలమునకు దేవతలు వచ్చి దధీచిని అస్త్రము లిమ్మనికోరిరి. దధీచి తాను చేసిన పనిచెప్పి దీనికి మీ ఆలస్యమే కారణమని పలికెను. దేవతలు భయపడినవారై ఎట్లో తమ ఆయుధములను ఇమ్మని కోరిరి. దధీచి ఆ అస్త్రములన్నియు జీర్ణములై ఎముకలకు వ్యాపించి నవనియు అవసరమైనచో నన్ను చంపి తీసుకొనమనియు పలికెను. దేవతలు ఆతనిని చంపు శక్తిలేక భయభ్రాంతులై దీనమైన ముఖముకలవారై ఏడ్వజొచ్చిరి. అంత దధీచి వారిని ఊరడించి "నేను మీ కొరకై జీవించు చున్నాను. ప్రస్తుతము మీకు ఆ ఆయుధములు అవసరము లేవు. మీకు అవసరమగునపుడు వచ్చిన నా దేహమును నేనే విడిచివేయుదును. నా ఎముకలే నూర్లకొలది బలసంపన్నములగు మీ ఆయుధములగును.

ఆలోచించక వెళ్లిరండి" అని సాగనంపెను. వారును మిగుల సంతోషముతో లోకహితార్థము కోరెడి వానికి నమస్కరించి వెడలిపోయిరి.

## 8. దధీచి దేవకార్యమునకై దేహమును త్యజించుట

ఒకానొకప్పుడు వృత్రాసురుడు తన సహచర రాక్షసులతో కూడి దేవతలకు గొప్పఆపద కలిగించెను. ఆతనిని జయింప శక్తి లేక దేవత లందరూ బ్రహ్మదగ్గరకు వెళ్ళి ప్రార్థించిరి. అప్పుడు బ్రహ్మ దేవతలను చూచి "దీనికి తరుణోపాయము మీరు దధీచిని ప్రార్థించి అతని ఎముకలను తీసుకొని వానిని ఆయుధములుగ ఉపయోగించిన ఆ రాక్షసులను చంప గలరు. దీనికి మించిన ఉపాయము వేరొకటి లేదు" అని పలికెను.

దేవతలు దధీచి యొక్క వాగ్దానమును జ్ఞప్తికి తెచ్చుకొని అతని దగ్గరకు వెళ్ళి తమ స్థితిని తెలుపుకొని సంరక్షించమని వేడుకొనిరి. దధీచి తన భౌతిక దేహమును విసర్జించి దేవహితమును చేయుటకంటే వేరైనది లేదని తలంచుకొని "దేవతలారా! మీరు వెంటనే నన్ను చంపి నా అస్థులను తీసుకొనిపొండు" అని చెప్పెను. అంత ఇంద్రాదులు భయకంపితులై "మహాత్మా! నిన్ను చంపుశక్తి మా దగ్గర లేదు. అది బ్రహ్మహత్య, మహా పాతకము. నీకు శివుడే స్వచ్ఛంద మరణమును అనుగ్రహించియున్నాడు" అని పలికిరి. వారి మాటలను విన్న దధీచి "అట్లు అయినచో నేనే యోగాగ్నిని కల్పించుకొని మరణించెదను. అటుపై మీ కర్తవ్యమును మీరు నిర్వర్తించుడు" అని యోగాగ్నిని కల్పించుకొని పరబ్రహ్మ అనుసంధాన మున దేహమును త్యజించి పరమశివునిలో ఐక్యమయ్యెను. అటుపై దేవతలు గోగణమును ప్రార్థించి వానిచే పరిశుద్ధము చేయబడిన దధీచి అస్తులనే బ్రహ్మచక్రము, వజ్రాయుధము మున్నగు ఆయుధములను చేసుకొని అసురులను చంపిరి[1].

1. ఈ వృత్తాంతము బ్రహ్మ, స్కాంద, శివ పురాణములలో కలదు.

## 9. దధీచికి పిప్పలాదుడు ఉద్భవించిన విధము

దదీచిమహర్షి చనిపోవుసమయమునకు అతని భార్య సువర్చ గర్భవతియై యుండెను. భర్త మరణమును వినగానే సహగమనమునకై చితికెక్కెను. ఇంతలో బ్రహ్మాదులు ప్రత్యక్షమై "ఓ సాధ్వీ! నీ గర్భమున మహాత్ముడగు బాలుడు ఉన్నాడు. కావున ప్రాణత్యాగము చేయకుము" అని పలికెను. అందులకు సువర్చ "ఓ దేవతలారా! మీ వర్తనము చూడ నాకు ఆశ్చర్యముగాయున్నది. నా భర్తను చంపితిరి. నాకు వైధవ్యము ప్రసాదించిరి. నా భర్తను చంపిన దేవతలు పశువులై ప్రవర్తించెదరు గాక!" అని శపించి భర్త చితికెక్కెను. అంతలో ఆమె గర్భమునుండి ఒక బాలుడు జారి దగ్గరలో ఉన్న పిప్పల వృక్ష సమీపములో పడెను. భర్త చితిలో తాను కూడా భస్మమయ్యెను.

అలా పిప్పల వృక్షముల క్రింద పెరిగిన బాలుడే పిప్పలాద మహర్షి. పిప్పల వృక్షములు అతనిపై జాలిపడి చంద్రుణ్ణి ప్రార్థించి అమృతమును తీసుకువచ్చి ఆ బాలునకు పోయగా అతడు ఆకలి దప్పికలు ఎరుగక చక్కగా పెరిగెను. ఆ కారణముననే ఇతనికి 'పిప్పలాదుడు' అను పేరు లోకసార్థకమయ్యెను.పిప్పలుడు పెరిగిపెద్దవాడై తన తండ్రి మరణమునకు కారణమైన దేవతలను చంపదలచి శివుని గూర్చి తపస్సుచేసెను. అతడు ప్రత్యక్షమై దేవతలను చంపతగిన సమర్ధమగు కృత్యమును పంపెను. అటుపై దేవతలు శివుని శరణు వేడగ శివుడును పిప్పలాదుని ప్రార్థించి దేవతలను చంపుపనిని విరమింపచేసి అతనికి పితృలోకమున తల్లితండ్రులను చూడ వరమిచ్చి అదృశ్యమయ్యెను. ఈ విధముగ దధీచి మహర్షి యొక్క కుమారుడు గొప్ప తపో వ్రత మహిమ కలిగిన వాడై మహర్షిగ లోకమున వెలుగొందెను[1].

---

1. మనకు ఈ వృత్తాంతము స్కాంద పురాణమున మహేశ్వర ఖండము, కేదార ఖండములలో కలదు.

## దధీచిమహర్షి స్తుతి

"దధీచి నామా!సుకన్యా చ్యవనుల పుత్రా!పులోమ భృగుమహర్షి పౌత్రా!
దధీచీ! సారస్వత జనకా! అమరేశ్వర ఇంద్ర శాస్త్ర విద్యా ప్రావీణా!
దధీచీ! దక్ష శాప కారకా! దేవతాకార్య నుతా! పిప్పలాది జనకా!
దధీచీ! వజ్రరూప అస్త్రాయుధ ప్రదాతా! సువర్చ పతే నమస్తే నమః"

ꕥ ❖❖❖ ꕥ

# 6. దుర్వాసమహర్షి

## 1. దుర్వాసమహర్షి జననము

దుర్వాసమహర్షి అత్రి అనసూయల కుమారుడు. త్రిమూర్తులు అనసూయకు ఒసంగిన వరప్రసాదము. ఇతడు శివాంశ సంజాతుడు. హైహయుడు అను రాజు దుష్టుడై అనసూయకు గర్భనిరోధమును కావించెను. ఇది తెలిసిన శివుడు ఆ రాజును నిర్మూలించుటకు దుఃఖమును, కోపమును దాల్చి గర్భమునందు ఏడు దినములుండి '**దుర్వాసుడు**' అను నామమున రుద్రుడు తమోగుణోద్రిక్తుడై అవతరించెను. వెంటనే అతని తేజోంశముచే హైహయుడు భస్మమయ్యెను.

దుర్వాసుడు క్రమముగా పెరిగి తల్లిదండ్రులచేత ఉపనయన సంస్కారాదుల పొంది అటు పిమ్మట ఏకాకియై మహోగ్రతపమును చేసెను. అతని బ్రహ్మచర్య దీక్షకును తపోనిరతికిని ముల్లోకములు ఆశ్చర్యమును పొందెను. తత్ఫలితమున తను ఏలోకమును తలచిన క్షణముననే ఆ లోకమునకు పోవు సామర్థ్యమును సంపాదించెను. అతని తేజస్సును చూచి సురయక్షకిన్నెరాదులు జోహార్లు పలికిరి. ఈ విధముగ దుర్వాసుడు త్రిలోకములయందు సంచరించు చుండెను. తరువాత తల్లిదండ్రులను, సర్వసంగములను విడిచి 'ఉన్మత్తము' అను ఉత్తమ వ్రతమును అవలభించి తిరుగుచుండెను.

### 2. దుర్వాసుడు ఇంద్రుని శపించుట

దుర్వాసుడు విష్ణుమూర్తిని దర్శించి అతని ఆశీస్సులతో ఒక పారిజాత పుష్పమును, విద్యాధరకాంతలు మార్గమధ్యమున ఇచ్చిన పుష్పమాలికలను చేతిలోపెట్టుకొని పయనమై వచ్చుచుండెను. మార్గ మధ్యమున దేవేంద్రుడు తన వాహనమైన ఐరావతమును ఎక్కి నందనవన ఉద్యానవన విహారమును గాంచి దుర్వాసునకు ఎదురయ్యెను. దుర్వాస మహర్షిని చూచి ఇంద్రుడు పలకరించి నమస్కారముపెట్టగ దుర్వాసుడు అతనిని చూచి సంతసముగ తన దగ్గర ఉన్న పుష్పమాలికను అతనికిచ్చెను. కాని ఇంద్రుడు నిర్లక్ష్యభావముతో ఆ పుష్పమాలికను ఐరావతతలపై పెట్టగ అది తన తొండముతో ఆ మాలికను లాగి చించివేసెను.

అంత దుర్వాసుడు కోపించి "ఓ దుర్మదాంధ! పవిత్రమైన విష్ణు ప్రసాద మాలికను నీకు బహుకరించగ ఇంత నిర్లక్ష్యము చేసెదవ" అని మంత్రజలముతో "నీ ఐశ్వర్యమంతయు గంగపాలు అగుగాక! నీ ఐరావతము శిరము ఖండింపబడుగాక!" అని శపించెను. అటుపై ఇంద్రుడు దుర్వాసుని పాదములపై పడి క్షమించమని వేడుకొనెను. శాంతించిన దుర్వాసుడు కరుణించి "నీవు శ్రీహరిని పూజించినచో తిరిగి నీ సంపదలను పొందగలవని" చెప్పెను. ఈ శాపము వలన మనము గ్రహించినది ఏమనగ అమృతాదులెల్ల సముద్రము పాలయ్యెను, ఐరావతము శిరము నరుకబడి వినాయకుడికి అతకబడెను[1].

### 3. దుర్వాసుడు ధర్ముని శపించుట

పూర్వము ఒకనాడు దుర్వాసుడు తన సోదరుడగు దత్తాత్రేయునితో కలిసి ధర్మదేవతయొక్క నిజరూపమును చూడకోరి అనేక సంవత్సరములు

---

1. అని విష్ణుపురాణమున చెప్పబడినది. దుర్వాసుడు ఇంద్రునిపై కోపించిన విషయము వరాహపురాణము నందు కూడ చెప్పబడినది.

తపస్సు చేసెను. వారు చేసిన తపస్సు వర్ణింప అలవికానిది. అహారము లేనివారై పంచభూతములలో ఒకటి అయిన పంచాగ్ని మధ్యమునను జలమధ్యమునను నిలిచి ఘోరతపస్సును చేసినప్పటికి ధర్మదేవత ప్రత్యక్షము కాలేదు. అంతట కోప స్వభావము గలవాడైన దుర్వాసుడు ధర్ముని శపింప ప్రయత్నింపగ ఇంతలో ధర్మదేవత బ్రాహ్మణ రూపంలో తన పరివారముతో ప్రత్యక్షమయ్యెను.

కాని దుర్వాసుడు అధిక కోపోద్రిక్తుడై తన శాపాక్షరముల శపింప ఏవో మాటలను పలుకబోయెను. అంతట ధర్మదేవత "తాపసులకు కోపము పనికిరాదు. క్రోధము వలన తాపసులకు తపఃఫలము చేరదుకదా!" అని పలికెను. ఆ మాటలను లెక్కచేయక దుర్వాసుడు కోపముతో "ఓరీ! ముందు నీవెవరో చెప్పుము. నీతో వచ్చిన ఈ పరివారము ఎవరో చెప్పుము. అటుపై నాకు కోపము తగునో తగదో చెప్పెదను" అని పలికెను.

అంత ఆ విప్రుడు "మునీంద్రా! బ్రహ్మ చర్యము, సత్యము, తపము, దానము, దమము, నియతి, శౌచము, క్షమ, శాంతి, ప్రజ్ఞ, అహింస, శ్రద్ధ, మేధ, దయ అను గుణములు పుం - స్త్రీ రూపములు. వీరు నా పరివారము. నేను ధర్మదేవుడను. నీ కోపము బాపవచ్చితి నని" చెప్పెను. కాని దుర్వాసుడు శాంతిపక "ఓయీ! పదివేలేండ్లు అయిన తరువాత నీకు మేము ఇప్పుడు కనబడితిమా? ఇప్పుడైనను నా శాపమునకు నీవు భయపడి వచ్చితివేకాని నీ యోగ్యతతో కాదు. బ్రాహ్మణకోపము చాలా గొప్పది. నిన్ను నేను ఇప్పుడు శపించక మాననుఅని" మూడు శాపములను ఇచ్చెను.

1) సుఖము తెలియని రాజుగను 2) దాసీ పుత్రుడుగను 3) చండాలుడుగను.

ఆ శాప ఫలితమే ఒక అంశమున ధర్మరాజుగను మరొక అంశమున విదురుడుగను వేరొక అంశమున హరిశ్చంద్ర మహారాజును ఏడిపించిన

వీరబాహుడను చండాలుడుగ జన్మించెను. "ఎంత వారికైనను కర్మఫలము అనుభవింపక తప్పదుగదా[1]!"

### 4. దుర్వాసుడు సుప్రీతకుని అనుగ్రహించుట

కృతయుగమున 'సుప్రీతకుడు' అను మహారాజు శుభ లక్షణము లైన భార్యలు ఎందరున్నను వారిలో ఏ ఒక్కరి ద్వారా ఒక్క కుమారుని కూడా పొందలేక పోయెను. చివరికి ఆ రాజు కుమారుని కోసము దుర్వాస మహర్షి గురించి తపస్సుచేయగ దుర్వాసుడు కరుణించి నీభార్యలలో 'విద్యుత్ప్రభ' అను భార్యకు కుమారుడు కలుగును అని వరమిచ్చి వెడలి పోయెను.

అంత సుప్రీతకునకు 'విద్యుత్ప్రభ' అను భార్యవలన 'దుర్జయుడు' అను పుత్రుడు జన్మించెను. అతనికి దుర్వాసుడే జాతకర్మలను చేసెను. సర్వశాస్త్రములను నేర్పెను. అటుపై దుర్వాసుడు ఒక ఇష్టి వేల్చి ఆ బాలుని పదునాలుగు సంవత్సరములు గలవానిగ చేసెను.సుప్రీతకుడు ఇంకను ఎంతయో భక్తితో దుర్వాసునకు సేవ చేయగ అతనికి 'కాంతిమతి' అను భార్యయందు మరొక కుమారుడు కలుగునట్లు వరమిచ్చెను. ఆ కుమారుని పేరే 'సుద్యుమ్నుడు'. ఈ విధముగ దుర్వాసుని వరముచే సుప్రీత మహారాజు నకు అటు విద్యుత్ప్రభయందు 'దుర్జయుడు'ను, ఇటు కాంతిమతి యందు 'సుద్యుమ్నుడు' అను కుమారుడును కలిగిరి[2].

### 5. దుర్వాసుడు తిలోత్తమా సాహసికులను శపించుట

ఒకానొక సమయమున దుర్వాసమహర్షి గంధమాదన పర్వతముపై తపస్సు చేసుకొనుచుండెను. ఆ సమయమున బలి చక్రవర్తి కుమారుడైన

1. ఈ విషయము పద్మపురాణమున భూమిఖండలో కూడ చెప్పబడినట్లు తెలియుచున్నది.
2. ఈ ఇతివృత్తము వ్యాస విరచిత వరాహపురాణమునందు కలదు.

'సాహసికుడు', అప్సరసయైన 'తిలోత్తమ' కామోద్రిక్తులై దుర్వాసుని ఎదుటనే సంభోగింపసాగిరి. వారి ఆహ్లాదశబ్దములు ఆనందపరవశముతో వారి మాటలు దుర్వాసునికి వ్రతభంగము కలుగగా కోపించినవాడై "హద్దులుమీరి సమయాసమయములను పాటింపక మీరిరువురు కామక్రీడలు జరుపుట ఉచితమా" అని మందలించి మంత్రజలముతో "మీరు భూలోకములో రాక్షసులై జన్మించెదరు" అని శపించెను.

అంత వారిరువురు "స్వామి మమ్ములను క్షమించి శాపవిమోచ నమును గావింపమని" ప్రార్థించిరి. అంత దుర్వాసుడు "సాహసికునికి శ్రీకృష్ణుని చేతిలో చనిపోయిన పిదప శాపవిమోచనము కలుగునని, శ్రీ కృష్ణుని కుమారుడితో జీవనమును సలిపినచో తిలోత్తమకు శాపవిమోచనము కలుగునని" పలికెను. కావున సాహసికుడు దుర్వాసుని శాపముచే గార్ధభాసురిడిగ, తిలోత్తమ 'బాణుని' కి 'ఉష' గ జన్మించెను[1].

### 6. దుర్వాసుడు వపువను అప్సరసను శపించుట

ఒకానొకరోజు ఇంద్రుడు నందనోద్యానమున అప్సరసల గానము విను సమయమున నారదుడు వచ్చెను. ఇంద్రుడు అతనిని పూజించి "ఓ మునీంద్రా! వీరిలో ఎవరు ఎక్కువో చెప్పుడని" పలికెను. అంత నారదుడు "హిమవత్పర్వతముపై తపస్సు చేయుచున్న దుర్వాసుని మనస్సును ఎవరు చలింపచేయుదురో వారే తక్కిన వారికంటే ఎక్కువ" అని పలికెను. అంత అప్సరసలెల్లరు తమకు ఈ పని సాధ్యము కాదని మౌనము వహించిరి. కాని వారిలో 'వపు' అను అప్సరస మాత్రము గర్వముతో "ఓ మునిరాజా! నేను దుర్వాసుని వెంట తీసుకొని వచ్చెదను. దుర్వాసుడే కాదు నేను తలచుకొన్నచో సాక్షాత్తు రుద్రుడినైనను కాముని ఇంటికి దాసుడిని చేయగలను" అని చెప్పి దుర్వాసుని వద్దకు వెళ్లెను.

---

1. ఈ విషయము బ్రహ్మపురాణమునందు కలదు.

తపస్సు చేసుకొనుచున్న దుర్వాసుని వద్దకువెళ్ళి వపు అను అప్సరస హావభావ ప్రదర్శనల మైమరపింప చేసి వ్రతభంగము కావింప ప్రయత్నించెను. అంత వపునుచూచి దుర్వాసుడు కోపించి "నీవు భూలోకమున పక్షివై పుట్టెదవు" అని శపించెను. అంత ఆమె ప్రార్థింపగ మోక్షమును అనుగ్రహించెను[1].

## 7. దుర్వాసుని వివాహము

పూర్వము దుర్వాసుడు గంధమాదనపర్వతముపై తపస్సు చేసుకొనుచుండగ తన ఎదుటనే రతిక్రీడను గావించిన తిలోత్తమ, సాహసికుల దృశ్యము మనస్సున కలుగగ తాను కూడా సంసార వాంఛతో 'ఔర్వమహర్షి' కుమార్తె యగు 'కందళి' అను ఆమెను వివాహము చేసుకొనెను. కాని వివాహము చేయు సమయముననే తండ్రియగు ఔర్యుడు దుర్వాసునితో తన కుమార్తెయగు కందళి మిగుల కోపిష్టి అనియు అవివేకి అనియు చెప్పి అందులకు మన్నింపమనియు పలికెను. అందులకు దుర్వాసుడు అంగీకరించి కందళిని వివాహమాడి ఉచిత భోగములను పొందెను. తుదకు ఆమె గయ్యాళి అయి అతనిని బాధింపజూచెను.

## 8. దుర్వాసుడు భార్యను భస్మము చేయుట

ఎంతకాలమైనను కందళి తనగుణమును మార్చుకొనలేని స్థితితో నుండగ దుర్వాసుడు విసిగివేసారి కోపోద్రిక్తుడై తీక్ష్ణముగ ఆమెను చూచెను. ఆమె భస్మమై ఒక సుందరి రూపమున ఆకాశమున కనిపించి తన దోషమును క్షమింపమని కోరి అదృశ్యమయ్యెను. అంత దుర్వాసుడు తనఅంతటి వానిని వివాహమాడిన కారణమున ఆమె పేరు భూమిపై శాశ్వతముగ అగునట్లు 'కదళీ' జాతిని సృష్టించి ఆమె నామమును చిరస్థాయిగ గావించెను[2].

1. ఈ విషయము మార్కండేయ పురాణమునందు కలదు.
2. ఆ కందళియే ఈ కదళీ జాతి అని బ్రహ్మ పురాణమున ఉందని ఇంచుక తెలియు చున్నది.

### 9. ఔర్వుడు దుర్వాసుని శపించుట

ఒకనాడు ఔర్వుడు తన కూతురుని అల్లుడిని చూడగోరి దుర్వాసుని ఆశ్రమమునకు వచ్చెను. కాని తన కుమార్తె అక్కడ లేని కారణమున తన దివ్యదృష్టితో జరిగిన వృత్తాంతమును గ్రహించి పశ్చాత్తాపముతో దుర్వాసుని చూచి " ఓరి! నీవు ఒప్పుకొని నా కుమార్తెను వివాహము చేసుకొని ఇప్పుడు ఆమెను భస్మముచేసి నన్ను అవమాన పరచితివి. దీని వలన నీవు 'అంబరీషుడు' అను రాజు వలన గొప్ప అవమానమును పొంది దుఃఖమును అనుభవించెదవు" అని శపించి వెళ్ళెను.

అందుకు దుర్వాసుడు ఇక చేయునది లేక కానున్నది కాక మానదు అని తనలో తాను సమాధానపరచుకొని తన దారిన తాను పోయెను. ఈ విషయము మనకు 'బ్రహ్మవైవర్త పురాణము' లో ఉన్నట్లు తెలియుచున్నది.

### 10. దుర్వాసుడు అంబరీషుని దగ్గర అవమానబడుట

ఒకనాడు దుర్వాసుడు 'ఆభాగుని' యొక్క కుమారుడు అయిన 'అంబరీషుని' దగ్గరకు వెళ్ళి ఆతిథ్యము కోరెను. భక్తాగ్రేసరుడు అగు అంబరీషుడు మహాప్రసాదమని అంగీకరించి అతనిని శిష్యసమేతముగ స్నానము చేసి రమ్మనెను.

అంత దుర్వాసుడు శిష్యులతో నదీస్నానమునకు ఏగి ఎంతసేపటికి రాకపోయేసరికి ఆనాటి ద్వాదశీవ్రతమును చేసెడి అంబరీషుడు చేయునది లేక బ్రాహ్మణ అనుమతితో దాహార్తుడై నీటిని త్రాగెను. అటుపై కొంతసేపటికి నదీస్నానము చేసి వచ్చిన దుర్వాసుడు అది గ్రహించి కోపోద్రిక్తుడై అంబరీషుని శిక్షింప తన జటలనుండి ఒక కృత్యను మంత్రించి పంపెను. అంతట విష్ణువు తన భక్తుడైన అంబరీషుని కాపాడ తన చక్రమును పంపెను. ఆ చక్రము దుర్వాసుని యొక్క కృత్యను రూపుమాప అతనిపైకి రాగా దుర్వాసుడు

పారిపోయి శివుని శరణుజొచ్చెను. శివుడు "నీవు విష్ణువు దగ్గరికి వెళ్ళి రక్షింప ప్రార్థించమని" చెప్పెను. అంత విష్ణువు "నా భక్తుడైన అంబరీషుని శరణు వేడుమని" వెనుకకు పంపెను. చివరకు అంబరీషుని చెంత చేరగ ఆ చక్రము అంబరీషుని ప్రార్థనచే వెనుకకు మరలెను.

అంత పశ్చాత్తాప పడినవాడై ఇదంతయు తన మామయైన ఔర్వుని శాపమువలననే కలిగినది అని అంబరీషునికి చెప్పి తిరిగి తనదారినతాను వెడలిపోయెను[1].

### 11. దుర్వాసుడు శబర తాపసుని పరీక్షించి వరములొసగుట

పూర్వము ఒకనాడు శబరతాపసుడు అడవిలో మహాతపస్సు చేయుచుండగ దుర్వాసుడు అచ్చటికి వెళ్ళెను. ఆ బోయవాడు అతనిని ఎంతయో పూజించి తనకు అతిథివి కమ్మని కోరెను. దుర్వాసుడు అతనిని పరీక్షింపతలచి అతని కోరికను సరి అనెను. ఆ శబరుని చిత్తశుద్ధికి మెచ్చి ఆకాశవాణి ఒక మణిని పంపెను. ఆ మణి వలన ఎందరో యువతులు పుట్టి పంచభక్ష్యపరమాన్నములను సిద్ధము చేసిరి.

అంత శబరుడు దుర్వాసుని భోజనమునకు రమ్మని ఆహ్వానించెను. కాని దుర్వాసుడు తనకు జలములు కావలయునని కోరెను. శబర తాపసుడు 'దేవికా' నదిని ప్రార్థించి ఆమెను దుర్వాసుని కడకు వచ్చి ప్రవహించునట్లు చేసెను. దుర్వాసుడు ఆనందించి ఆ నీట మునిగి వచ్చి అతని ఇంట ఆతిథ్యమును స్వీకరించి ఇట్లనెను "ఓ శబరా! నీవు గురూపదేశ మార్గమున సత్యంబు అవలంభించి తపంబు చేసితివి. ఇక నుండి నీవు 'సత్యతపు' డని పేరు పరగుము. వేదశాస్త్ర పురాణాల పాండిత్యము నీకు అబ్బుగాక" అని ఆశీర్వదించెను.

---

1. ఈ ఇతివృత్తము మనకు భాగవతములో ఉన్నట్లు తెలియుచున్నది.

అటుపై దుర్వాసుడు అతనికి కొన్ని మాటలను ఉపదేశించెను. "ఓ శబరా! నీకు సుజ్ఞానమువలననే మంచికర్మ జరుగును. సత్కర్మమునగాని విజ్ఞానము పొడమదు. ఆలోచించక ఈ రెండును ఒకదానికొకటి సాధనములు అని తెలుసుకొనుము.

సత్కర్మములు జాతులను బట్టి నాలుగు విధములు. కులధర్మము తప్పక ఆచరించిన వారు, బ్రహ్మ ఉపాసుకులైన వారు మోక్షమును పొందుదురు. బ్రహ్మము అనగా ఎవరు? భక్త రక్షకుడైన నారాయణుడే. అతడే యజ్ఞాది వైదిక క్రియలకు సులభుడు అని చెప్పెను. అనగా దీని ఆంతరంగికము నారాయణుని చేరదలచిన యజ్ఞాదికార్యములు 'అగ్నిమూలే పురోహితమ్' అనునట్లుగ యజ్ఞపురుషుడిని తృప్తి చేయవలెను అని అర్థము". ఆ మాటలను విన్న శబరుడు "స్వామి! ధనసామాగ్రి లేకుండగ యజ్ఞాది కార్యము చేయలేము కదా. ధనము ఉన్నను లోభము వలన సంసారులు ఆకార్యమును జరుపలేరు. కావున సులభముగ అన్ని వర్ణముల వారికి అల్పప్రయాస మాత్రముచే మోక్షము కలుగు ఉపాయము ఏదైనా ఉన్నచో తెలుప"మని ప్రార్థించెను. అంత దుర్వాసుడు కొన్ని ఉత్తమ ఫలములైన వ్రతములను గూర్చి తెలిపి, అవి ఆచరించినచో ఇహపర సుఖములు కలుగునని ఉపదేశించి అతనిని ఆశీర్వదించి వెడలి పోయెను. అటుపై ఆ దుర్వాస మహర్షి చెప్పిన వ్రతములన్నియు ఆచరించి 'సత్యతపుడు' అను పేరును దుర్వాసునిచే పొందిన శబరుని జీవనము ధన్యమయ్యెను[1].

### 12. దుర్వాసుడు ముద్గలునకు అతిథియగుట

పూర్వము ముద్గలమహర్షి భిక్షాటన చేయుచూ ఉత్తమ తపమును ఆచరించుచుండగా అతని మనస్సును పరీక్షించి అతనికి ఉపకారము చేయ తలంచి దుర్వాసుడు అతని ఇంటికి అతిథిగా వెళ్ళెను. అతను

1. ఈ ఇతివృత్తము వరాహపురాణమునందు కలదు.

పక్షోపవాసమును చేయుచుండెను. (పక్షోపవాసమనగ నెలలో రెండుసార్లు వచ్చెడి శుక్లపక్షము, కృష్ణపక్షములలో ఉపవాసము చేయుట). తన ఇంటికి వచ్చిన దుర్వాసుని ముద్గలుడు సకుటుంబముగ గౌరవించి తాను తినుట మాని ఆ మునిశ్రేష్ఠునికి ఆహారము పెట్టి గౌరవించెడివాడు. దుర్వాసుడు వండిన అన్నము అంతయును తిని ఏదైన మిగిలినచో దానిని తన ఒంటి నిండా పూసుకొని పోయెడివాడు. ముద్గలుడు మాత్రము అతను ఎన్నిసార్లు ఇలా చేసినను మనసున కినుకు పడక (కోపముపడక) ఆ మహర్షికి గొప్పసేవ చేసెడివాడు. చివరికి అతని సహనమును పరీక్షించి సంతసపడి ముద్గలుని మిక్కిలి పొగడి అతనికి శరీరముతో కూడిన స్వర్గసుఖము సమకూరునట్లు వరమిచ్చెను. కాని ముద్గలుడు స్వర్గసుఖమును లెక్కచేయక బ్రహ్మర్షియై మోక్షమును పొందెను[1].

## 13. దుర్వాసుడు కుంతీదేవికి వరమిచ్చుట

దుర్వాసమహర్షి ఒకసారి కుంతిభోజుని ఇంటికి వెళ్ళెను. అతనికి అత్యంత భక్తిపూర్వకముగ సేవచేయుటకు కుంతిని నియమించెను. దుర్వాసుడు ఆమె సేవలకు మిగుల సంతసించెను. కుంతిభోజుని ఆశీర్వదించి అటుపై కుంతిదేవిని చూచి "నేను నీకు ఒక వరము ఇచ్చెదను. ఏమి కావలెనో కోరుకొనమనెను". అంత ఆమె "స్వామి! మీ తపఃశక్తి చేత మంత్రమును ఉపదేశింపుము. ఆ మంత్ర మహిమచే ఏ దేవుని ఉపాసించిన ఆ దేవుని వలన ఒక పుత్రుని పొందవలయును" అని కోరెను. ఆమె కోరికను విని సంతసించి దుర్వాసుడు సరియని వరమిచ్చెను. అంత కుంతి కన్యవయసుననే దుర్వాసుని వరమును పరీక్షింపకోరి సూర్యుని ప్రార్థింపగ సూర్యుని ఆశీర్వచనములచే ఆమె కర్ణమునుండి 'కవచ కుండలములతో' బాలుడుద్భవించెను. అతడే 'కర్ణుడు'[2].

1. ఈ ఇతి వృత్తము భారతమున అరణ్యపర్వమునందున్నది
2. ఈ ఇతివృత్తము భారతమున ఆదిపర్వమునందున్నది.

### 14. దుర్వాసుడు యోగమాయను వివాహమాడుట

ఒకానొకనాడు దుర్వాసుడు 16 వేల గోపికలను, అష్టమహిషీ మణులను వివాహమాడిన ద్వాపరయుగనాథుడును సంపూర్ణ అవతార పురుషుడైన శ్రీకృష్ణుని చూడ ద్వారకకు వెళ్ళెను. ద్వారకకు సమీపించెడి దుర్వాసుని రాక గ్రహించి ఊరి పొలిమేరలోనే శ్రీ కృష్ణుడు ఉగ్రసేన వసుదేవాదులతో ఎదురువచ్చి అతనికి అర్ఘ్యపాద్యా దులనిచ్చి తన యింటికి తీసుకొని వచ్చెను. అచ్చట శ్రీకృష్ణుడు నవయవ్వనవతి హావభావవిలాసముతో అతిసుందరాంగి అయిన యోగమాయను అతని సేవకు నియోగించెను.

దుర్వాసుడు ఆమె సేవలకు సంతసించి వరముకోరుకొన మనెను. ఆ మాటలు విన్న శ్రీకృష్ణుడు ఉగ్రసేనాదులను పిలిచి దుర్వాసమహర్షి శివుని అంశమున పుట్టినవాడు యోగమాయ పార్వతి అంశమున పుట్టినది. కావున వీరిద్దరికి వివాహమునకు తన అంగీకారము తెలిపెను. వారిరువురు కూడా వివాహమునకు అంగీకరించిరి. అటుపై వైభవోపేతముగ వారికి శ్రీకృష్ణుడే దగ్గరవుండి వివాహము జరిపించెను. అటుపై శ్రీకృష్ణుడు వినయముతో కొంత కాలము ద్వారకానగరమునందే బసచేయమని ప్రార్థించెను. ఇలా ఉండగా దుర్వాసుడు శ్రీకృష్ణుని మహాత్మ్యమును తెలుసుకొన బోయి రాత్రియందు వరుసగా అష్టమహిషిల ఇండ్లకు పదహారు వేల గోపికల ఇండ్లకు వెళ్ళి చూచెడివాడు. అతడు ఏ యింటికి వెళ్ళినను అచ్చట శ్రీకృష్ణుడు భార్యాసహితముగ కనబడెడివాడు. చివరకు కృష్ణుని మహిమను ఎరిగి స్తుతించి ఆనందించెను[1].

### 15. దుర్వాసునికి పార్వతి శ్రీకృష్ణుని గురించి తెలుపుట

ఒకానొకనాడు దుర్వాసుడు తన భార్యయైన యోగమాయతో ద్వారకానగరమున యథేచ్ఛగా కాలమును గడుపుతూ భూమిపై కాలము

1. ఈ విషయము భారతమున మరియు బ్రహ్మవైవర్తపురాణమున కనబడును.

వృధా చేయుటకంటే కైలాసమునకు పోయి పార్వతీ పరమేశ్వరుల పాదసేవ చేయుటయే పరమకర్తవ్యమని తలచి భార్యతో గాని శ్రీకృష్ణునితో గాని చెప్పకయే కైలాసమునకు పోయి పార్వతీ పరమేశ్వరుల పాదసేవ చేయ చూచెను. శివుడు అతనిని కౌగలించుకొని ఆశీర్వదించెను. పార్వతి దీవించి విశేషములను అడిగెను.

అంత దుర్వాసుడు పార్వతినిచూచి "అమ్మా! భూలోక జీవనమున ప్రాణము విసిగిపోయినది. ఇకపై మీ చెంతనేయుండి మీ ఇరువురి సేవచేయుచు కాలము గడిపెదను" అని పలికెను. ఆ మాటలు విన్న శివుడు పార్వతివైపు చూసెను. అంత పార్వతి "ఓ కుమారా! నీవు మా కడ ఉండిపోవుట మాకు ఆనందకరమె కాని నా అంశమున పుట్టిన యోగ మాయను వివాహమాడితివి గదా! ఆమెను అచ్చట విడిచి వచ్చితివి. ఆమె ఎంతయో దుఃఖించుచూ బాధపడుచున్నది. అగ్ని సాక్షిగ వివాహమాడిన భార్యను అకారణముగ అట్లు విడువవచ్చునా? ఆమె మహాపతివ్రత. ఆమె వలన నీకు సత్సంతానము కలుగును. మరియు శ్రీకృష్ణుడు మానవ మాత్రుడు కాదు గోలోకవాసియైన పరబ్రహ్మయే. ఆయన పాదపద్మములను కొలచుట మా సేవచేయుటకన్నా కోటి రెట్లు అధికము. కావున నీవు భూలోకమున ద్వారకకువెళ్ళి శ్రీకృష్ణుని సేవ చేయుచూ నీ భార్యవలన సంతానమును పొంది సుఖముగా ఉండుము" అని బోధించెను. అటుపై దుర్వాసుడు వారి మాటలను విని వారికి నమస్కరించి తిరిగి ద్వారకకుపోయి సుఖముగాయుండెను[1].

### 16. దుర్వాసుడు శ్రీకృష్ణుని, యాదవులను శపించుట

దుర్వాసమహర్షి ఒకనాడు కృష్ణుని పరీక్షింప సత్యభామ గృహము నకు పోయెను. అచట శ్రీకృష్ణుడు సత్యాసహితుడై దుర్వాసుని పూజించలేదు.

1. ఈ ఇతివృత్తము శివపురాణమునందు ఉన్నట్లుగ తెలియుచున్నది.

అంత దుర్వాసుడు కృష్ణుని శాంతస్వభావమును పరీక్షింప ఒక రథమును ఎక్కి ఆ రథమునకు రథ్యముగ (గుఱ్ఱముగ) సత్యామాధవులను ఉండమని పురికొల్పెను. వారు ఎంతో సహనముతో అతని కోరికను నెరవేర్చిరి. అటుపై వారి సహనమును చూచి ఆశ్చర్యమును పడిన దుర్వాసుడు వారికి వరములు ఇచ్చి వెళ్ళి పోయెను. మరొక పర్యాయము దుర్వాసుడు చీరవసనుడు, బిల్వఖండుడు, దీర్ఘశ్మశ్రుడు, కృశశరీరుడై రుక్మిణీ సహితుడైన శ్రీకృష్ణుని దగ్గరకువెళ్ళి ఆతిథ్యము కోరెను. శ్రీకృష్ణుడు మిక్కిలి భక్తితో అతనికి నమస్కరించి ఉచిత శయ్యా వాసములను ఏర్పరచి షడ్రసోపేతముగ విందును చేయు చుండెను.

అతడు అనేక చేష్టలు కలవాడై ఒక్కొక్కరోజు ఒక్కొక్క విధముగ వారిని పరీక్షించుచుండెను. ఒకరోజు వెయ్యిమంది తినగల పదార్థములను తినెను. ఒకరోజు కొద్దిగనే ఆహారమును తీసుకొనెను. ఒక రోజు ఉపవాసము ఉండెను. ఇట్లుండ ఒకానొక రోజున తాను బసచేసిన ప్రదేశమును, తన శయ్య మొదలైన వాటిని భస్మముచేసి రుక్మిణి శ్రీకృష్ణుల వద్దకు వచ్చి తనకు వెంటనే పాయసము వండి పెట్టమని కోరెను. అతను కోరినట్లే రుక్మిణి పాయసము సిద్ధము చేసెను. ఆ పాయసము దుర్వాసుడు రుక్మిణి దేహమునకు పూసెను. శ్రీకృష్ణుడు శాంతముగనే ఉండెను. తుదకు శ్రీకృష్ణుని చూసి ఈ పాయసము నంతను నా దేహమునకు పూయమనెను. అంతట శ్రీకృష్ణుడు దేహమునంతట పూసి పాదములకు పూయ మరచెను. వెంటనే కోపగించిన దుర్వాసుడు శ్రీకృష్ణునికి అరికాళ్ళనుండియే ప్రాణభయము కలుగునని శపించెను. అటుపై దుర్వాసుడు శ్రీకృష్ణరుక్మిణిల సహనమునకు సంతసించి శ్రీకృష్ణుడు పరమ శుభములుకలిగి, సర్వలోక ప్రియుడగుటకును రుక్మిణిదేవి ఉత్తమ పతివ్రతయు అగుటకును తగిన వరములను సంతసముతో ఇచ్చి అచటినుండి వెడలిపోయెను[1].

1. ఈ విషయము విష్ణుపురాణమునందును, భాగవతమునందు ఉన్నది.

శ్రీకృష్ణుడు ఒకసారి యాదవవంశ వినాశనము ఎలా జరుగవలయునా అను విషయమునుగూర్చి ఆలోచించుచూ దుర్వాసమహర్షిని స్మరించెను. త్రికాలజ్ఞుడగు దుర్వాసుడు ఇది తెలుసుకొని ద్వారకకువచ్చి వాకిటిలో నిలబడియుండగా యాదవ కుమారుడు అగు 'సాంబుడు' అను వానికి స్త్రీ వేషము వేసి యాదవులు దుర్వాసుని చూచి "ఓ మునీంద్రా! ఈమెకు పుత్రుడు ఎప్పుడు కల్గునని" పరిహసించిరి. దుర్వాసుడు అది గ్రహించి శ్రీకృష్ణుని సంకల్పము నెరవేరుటకు సమయము ఆసన్నమైనదని గ్రహించి "మూర్ఖులారా! లోహరూప ముసలము ఉదయించి సముద్ర బాంధవముగ యాదవ వంశమును నిర్మూలించును. బ్రహ్మాదులు కూడా దీనిని తప్పించలేరు" అని శపించి వెళ్ళిపోయెను. అతని శాపమువలననే యాదవులందరు అంతరించిరి.

## 17. దుర్వాసుడు పాండవులకు అతిధియగుట

ఒకానొకసారి ద్వాపరయుగంలో దుర్యోధనుడు పాండవుల అవమానింపగోరి దుర్వాసుని ప్రసన్నము చేసుకొని అతనిని తన శిష్యులతో సహా పాండవుల దగ్గరకు వెళ్ళమని ప్రార్థించెను. అప్పుడు దుర్వాసుడు శిష్యసమేతుడై ద్వైతవనమున గల పాండవుల వద్దకు వెళ్ళగ ధర్మజుడు మొదలగువారు అమిత భక్తి శ్రద్ధలతో అతనిని సేవించిరి.

దుర్వాసుడు నా శిష్యులతో కలసి భోజనమునకు వచ్చెదను అని ధర్మజునకు చెప్పి తన శిష్యులతోకూడి నదీ స్నానమునకు పోయెను. అంతలో శ్రీకృష్ణుడు పాండవులను చూడవచ్చి ఆకలి బాధను నటించి ద్రౌపదిచేత పాత్రను తెప్పించి ఆ పాత్రలోని ఒక మెతుకును తాను తిని పాండవులకు అభయమును ఇచ్చెను. దీని వలన కృష్ణ ప్రభావముచే నదీస్నానముచేసి దుర్వాసునకు శిష్యులకును ఆకలి దప్పికల బాధలు లేకుండపోయెను. అటుపై దుర్వాసుడు సమస్త విషయములను యోగదృష్టితో తెలుసుకొని

దుర్యోధనుని కుటిల అభిప్రాయమును గ్రహించి అతడు బంధుమిత్రాదులతో పాండవులతో ఓడిపోయి చంపబడునని గుర్తించి శిష్యులతో వెడలిపోయెను.

**18. దుర్వాసుడు లక్ష్మణుని మరణమునకు కారణమగుట**

ఒకానొకసారి దుర్వాసుడు మిక్కిలి ఆకలి బాధతో శ్రీరామునిచే ఆతిథ్యము పొందు ఉద్దేశ్యముతో అయోధ్యకు వచ్చెను. ఆ సమయమున శ్రీరాముడు బ్రాహ్మణరూపుడగు యమునితో రహస్యముగ మాట్లాడుచు ఎవ్వరిని లోనికి రానీయవలదనియు తాను కూడ లోపలకు రావలదనియు లక్ష్మణున్ని హెచ్చరించి ద్వారము వద్ద నియమించెను.

ఇంతలో దుర్వాసుడువచ్చి లోనికి పోబోవగ లక్ష్మణుడు నివారించెను. అంత దుర్వాసుడు లక్ష్మణున్ని కోపించి వంశ నాశనముగ శపింతును అనెను. అందుకు లక్ష్మణుడు భయపడి శ్రీరాముని దగ్గరకు పోయి జరిగిన ఇతివృత్తమును వివరించెను. అంత శ్రీరాముడు తన ఆజ్ఞదాటిన లక్ష్మణున్ని అయోధ్యానగరము దాటి వెళ్ళమని ఆజ్ఞాపించెను. అటుపై అన్న అనుమతిని పొంది సరయూ నదిలో మునిగి అవతారము చాలించెను. ఈ విధముగ ఈ ఇతివృత్తమునకు దుర్వాసుడే కారణ మయ్యెను[1].

**19. దుర్వాసుని ఆధిక్యము**

పరమేశ్వరుని అంశమున పుట్టినవాడు, అనేకులగు శిష్య ప్రశిష్యులను తయారుచేసి వారికి ఎన్నో విద్యారహస్యములను ఆమూలాగ్రముగ తెలిపినవాడు, త్రిలోకమున పూజనీయుడు, లోకక్షేమమును కోరి భవిష్యత్తులో జరగవలసిన శుభకార్యములకు ఒక దిక్సూచి వంటివాడు, అనసూయగర్భ సూక్తిముక్తాఫలము, అత్రియొక్క తపఃసారమని ఎన్నో

1.ఈ ఇతివృత్తము ఉత్తరరామాయణమున ఉన్నది.

విధముల దుర్వాసమహర్షిని గురించి మనము చెప్పుకొనుటకు విశేషమైన అంశములు కలవు.

పై విషయములను బట్టి ఆలోచించినచో త్రికాలజ్ఞుడు, దివ్యదృష్టి జ్ఞాన తేజుడు, మిగుల కోపగ్రహ స్వభావి అని మనము ఎన్నో చెప్పుకొన్నను అటు త్రేతాయుగము పరిసమాప్తికి ఇటు ద్వాపరయుగ పరిసమాప్తికి మూల బిందువుగ ఇతని శాపములే కారణము అనవచ్చును. ఈశ్వరాంశ సంభూతుడు అత్రి అనసూయల తపఃశక్తి జనితుడు ఔర్వుని అల్లుడు కందళి పతిగను ప్రసిద్ధి చెందినను దుర్వాసుని యొక్క ఇతివృత్తము "పురాణములలో" ప్రసిద్ధికన్న పుణ్య చరితగా చెప్పుకొనవచ్చును.

అన్నిటికంటే ముఖ్యముగ దుర్వాసుడు చెప్పిన 'రుద్రకవచము' ఎంతో గొప్పది. పారాయణ కవచముగ రుద్రుని ఆశీస్సులకు భద్ర కవచముగ చెప్పుకొనవచ్చును. మహిమలు కలిగిన మహిమాన్వితుడు కార్యకారణ సమన్వితుడు అగు పరమ మహర్షి దుర్వాసో మహర్షి. అట్టి మహర్షికి మన మనోవాక్కులు.

**20. రుద్రకవచము**

"ప్రణమ్య శిరసా దేవం స్వయంభుం పరమేశ్వరం
ఏకం సర్వగతం దేవం సర్వదేవమయం విభుమ్
రుద్రవర్మ ప్రవక్ష్యామి అఙ్గప్రాణస్య రక్షణే
అహోరాత్రమయం దేవం రక్షార్థం నిర్మితం పురా
రుద్రోమే చాగ్రతః పాతు పాతు పార్శ్వౌ హరస్తథా
శిరోమే ఈశ్వరః పాతు లలాటం నీలలోహితః
నేత్రయోస్త్ర్యంబకః పాతు ముఖం పాతు మహేశ్వరః
కర్ణయోః పాతు మే శంభుః నాసికాయాం సదాశివః

వాగీశః పాతు మే జిహ్వాం ఓష్ఠౌ పాత్వంబికాపతిః
శ్రీకంఠః పాతు మే గ్రీవాం బాహూచైవ పినాకధృత్
హృదయం మే మహాదేవ ఈశ్వరో వ్యాత్త్సనాంతరం
నాభిం కటిం చ వక్షశ్చ పాతు శర్వ ఉమాపతిః
బాహుమధ్యాంతరం చైవ సూక్ష్మరూపస్సదాశివః
సర్వం రక్షతు మే శర్వో గాత్రాణి చ యథాక్రమం
వజ్రం చ శక్తిదం చైవ పాశాఙ్కుశధరం తథా
గండశూలధరాన్నిత్యం రక్షతు త్రిదశేశ్వరః
ప్రస్థానేషు పథే చైవ వృక్షమూలే నదీతటే
సంధ్యాయా రాజభవనే విరూపాక్షస్తు పాతుమాం
శీతోష్ణాదథ కాలేషు తుహినద్రుమకంటకే
నిర్మనుష్యే సమే మార్గే త్రాహిమాం వృషభధ్వజ"
ఇత్రేతద్రుద్రకవచం పవిత్రం పాపనాశనమ్
మహాదేవ ప్రసాదేన దుర్వాసోముని కల్పితమ్
త్రాహి త్రాహి మహాదేవ త్రాహి త్రాహి త్రయీమయ
త్రాహిమాం పార్వతీనాథ త్రాహిమాం త్రిపురాంతక
పాశం ఖట్వాంగదివాస్త్రం త్రిశూలం రుద్రమేవ చ
నమస్కరోమి దేవేశ త్రాహి మాం జగదీశ్వర
శత్రుమధ్యే సభామధ్యే గ్రామమధ్యే గృహాంతరే
గమనే గమనేచైవ త్రాహిమాం భక్తవత్సల
త్రికాలజ్ఞ త్రినేత్ర అంశస్వరూప అత్రి అనసూయ పుత్ర
నమస్తే నమస్తే నమోన్నమః
త్రికాల తపోమహిమాన్వితా త్రేతాయుగ ద్వాపరాంత
నాశనకారణరూప నమస్తే నమస్తే నమోన్నమః

త్రిలోక సంచారీ త్రిభువన సత్కార మహిమాన్వితా
ఔర్వ పుత్రి కందళీ భస్మకారణ
నమస్తే నమస్తే నమోన్నమః
త్రిలోక శక్తీశ్వర పాదసేవితా కుంతీ మనోమంత్రప్రభావ
వరప్రదాత లోకబాంధవా లోకపూజిత హే మహర్షే
పరమ ఋషే హే జ్ఞానరూప నమస్తే నమస్తే నమోన్నమః

**దుర్వాసోమహర్షి స్తుతి**

"దుర్వాస నామా! కోపోద్రిక్త భావా! అనవరత శాపాక్షర క్రోధరూపా!
దుర్వాస మహర్షే! ధర్ముని శాప కారాక! సుప్రీత అనుగ్రహ స్వరూపా!
దుర్వాస ఋషీ! కందళి భర్తృరూపా!ఔర్యశాపగ్రస్థా!యోగమాయ పతే!
దుర్వాస ఋషే!కుంతీ వరప్రదాతా!యాదవ వంశాంతకా!నమస్తేనమః"

## సమీక్షానివేదికుల సూచనాంశములు

### (సంగ్రహ ఋషులగాథలు)

# 7. గౌతమమహర్షి

**1. యుగము, పురాణగాథలు**

బ్రహ్మమానస పుత్రులలో ఒకడు సప్తర్షులలో సుప్రసిద్ధుడు శృతులననుసరించి గౌతమ వంశమున జన్మించినవాడు. గౌతమ ధర్మసూత్రకర్త.

**2. పురాణకావ్యములు**

పురాణ ఇతివృత్తములలో ఇతని గురించిన వృత్తములు బ్రహ్మాండపురాణము, శివపురాణ-జ్ఞానసంహిత, బ్రహ్మపురాణము, పద్మపురాణము, పంచమ వేదాలైన మహాభారత-అశ్వమేధపర్వమున, ఆదికావ్యమైన వాల్మీకి రామాయణము, ఉత్తర రామాయణములలో యితని ఇతివృత్తము కలదు.

**3. వేదోపనిషత్తులు**

వేదోపనిషత్తులలో గౌతమధర్మసూత్రము, స్మృతి, న్యాయ సంహితలు పేర్కొనబడినవి.

గౌతమధర్మసూత్రములు, గౌతమస్మృతి, న్యాయశాస్త్రమును వ్యాసుడు ఖండిపచూచిన వ్యాసునిపై కోపించిన గౌతముడు తన పాదమున నేత్రమును సృష్టించుకొని అతను చూచెను. నాటినుండి అతనికి అక్షపాదుడను పేరువచ్చెను.

గౌతమ న్యాయశాస్త్రము ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము మొదలైన షోడశపదార్థ నిరూపకమై పంచాధ్యాయములుగ ప్రకాశించు చున్నవి.

ఈ అధ్యాయములలో గల విషయాంశముల విషయ సూచికలను యిలా తెలుసుకొనవచ్చును.

**ప్రథమాధ్యాయము -** ప్రథమాహ్నియందు ప్రమాణాది పదార్థనవక లక్షణనిరూపణము. ద్వితీయాహ్నికమున - వాదాది సప్తలక్షణ - నిరూపణము కలవు.

**ద్వితీయాధ్యాయము -** ప్రథమాద్వితీయాహ్నికముల సంశయ పరీక్షణాదికము, అర్థాపత్త్యాద్యంతర్భావనిరూపణము కలవు.

**తృతీయాధ్యాయము -** శరీరేంద్రియార్థబుద్ధిమనః పరీక్షణము

**చతుర్థాధ్యాయము -** ప్రవృత్తి దోషాధికము, దోషనిమిత్తాధికము

**పంచమాధ్యాయము -** భేద, నిగ్రహస్థానభేద నిరూపణము కలవు. మూడవదగు గౌతమసంహిత గొప్ప జ్యోతిశ్శాస్త్ర గ్రంథము.

**4. జీవితవిశేషములు**

జీవిత విశేషములను కొన్ని సన్నివేశములను ఇలా తెలుసు కొనవచ్చును. (1) త్రేతాయుగ అవతారపురుషుడైన శ్రీరామచంద్రుడు అవతరించుటకు అతని మహిమలు వేనోళ్ళ కొనియాడబడుటకు ఇంద్ర అహల్యల ఇతివృత్తములు, అహల్యకు శాపమొసగి ఆ శాప నివారణ శ్రీరాముని పాదధూళి సోకినంతనే పోవునట్టుగ శాపవిమోచనము కలిగించెను.

అలాగే బ్రహ్మదత్తుడను రాజు రోజు తనకు ఆతిధ్యమిచ్చు సమయమున ఒకానొకనాడు తన భోజన పదార్థములలో మాంసపు

ముక్క కనబడగ బ్రహ్మదత్తునికి గ్రద్ధకు శపించెను. అంతట వినయ విధేయలతో ఆ శాపనివారణము కోరుకొనగ శ్రీరాముని హస్తము సోకగానే అది శాపమోచనము కలుగునని చెప్పెను. బ్రహ్మదత్తుడు గ్రద్ధయై పుట్టి ఒకానొకనాడు గుడ్లగూబతో శ్రీరాముని దగ్గరకు వచ్చి తగువుతీర్పమనగ ఆతడు తన పవిత్ర హస్తములతో ఆ గ్రద్ధను నిమరగ అతనికి శాపవిమోచనము అయ్యెను.

ఇకపోతే గోదావరినది పుట్టుకకు కూడా గోహత్యాపాతక దోషముగ గౌతమునికి తొలగినదన్నట్లుగ కూడా ద్వాదశ జ్యోతిర్లింగము లలో ఒకటైన త్రయంబకేశ్వర క్షేత్ర సమీప గోదావరినది జన్మపుట్టుకకు కారణమైన గాథ కూడా లోకమున విదితమే. ఇంద్రుని కూడా తన పత్నిని మోసగించి కోడిరూపములో కూతవేసి అక్రమ మార్గమున వలచిన ఇంద్రునికూడా తన దివ్యదృష్టితో కనుగొని దేవతల ప్రభువైన ఇంద్రుని యొక్క గర్వమును అణిచిన గాథ మనకు తెలిసినదే.

విఘ్నేశ్వరుని సూచన మేరకు శివుని కొరకు తపస్సుచేసి భూమికి గంగను తీసుకువచ్చుటకు గౌతముని తపస్సు ముఖ్యము. అలాగే బ్రాహ్మణులను కూడా కరుణించి శాపమిచ్చిన తాను ద్వాపర యుగమున శ్రీకృష్ణదర్శనముచే ముక్తికి పొందుదురని ఎన్నో గాథలు గౌతముని ఇతివృత్తమున మనము తెలుసుకొనవచ్చును.

¤❖❖❖❖❖¤

## 8. చ్యవనమహర్షి

### 1. యుగము

చ్యవనమహర్షి కృతయుగమునకు చెందినవాడు. ఇతడు భృగుమహర్షికి పులోమకు జన్మించినవాడు. భృగుమహర్షి ఋషులందరి లోను ప్రత్యేకమైన తపోదీక్షకలిగిన మహర్షి. పులోమకోరికననుసరించి తను చేసిన భక్తి సపర్యయలకు తను ఒక కుమారుడు కావలెనని కోరగ ఆమెకు సద్యోగర్భము వచ్చునట్లు చేసెను. కాని అంతకు మునపే పులోముడను రాక్షసుడు ఆమెను వివాహము చేసుకొనదలచి ఆమెపై మనస్సు పడియుండెను. ఎప్పుడైతే ఈ పులోమి గర్భము దాల్చెనో ఈ పులోముడను రాక్షసుడు ఒకానొకరోజున భృగుమహర్షి యింట లేకుండుట చూసి వారాహరూపమున ఆమెను బలాత్కారముగ ఎత్తుకొని పారిపోచూచెను. ఆ సమయమున ఆమె గర్భము చ్యుతము కాగా (క్రిందపడిన) ఆకుమారుని తేజస్సును చూచి పులోముడు భస్మీ భూతుడయ్యెను. అంత భృగుమహర్షి ఆ బాలునికి "చ్యవనుడు" అని పేరు పెట్టెను.

### 2. పురాణ, ఇతిహాస, కావ్యాలు

పంచమ వేదమైన భారత - ఆదిపర్వమున ఇతనిని గూర్చి వివరించబడెను. అలాగే అరణ్య, అనునాసనిక, దేవీభాగవతమున మొదలగు వాటియందు యితనిని గూర్చిన ప్రస్తావన కలదు. అలాగే ఉత్తరరామాయణమున బ్రహ్మవైవర్త పురాణమునందును యితనిని గూర్చి వివరించబడి యున్నది.

### 3. జీవితవిశేషములు

చ్యవనుని జీవన విధానము ధార్మికమైన ఇతివృత్తము. చ్యవనుడు వైదూర్యపర్వతప్రాంతమున అనేక వేల సంవత్సరములు శివుని గూర్చి తపస్సు చేసెను. ఒకానొక రోజున సంయాతియను రాజు తన కుమార్తెయగు సుకన్యతో దాహార్తియై సైన్యసమేతముగ ఆ చ్యవనుని ఆశ్రమసమీపమునగల సరోవరము నకు వచ్చెను. అచ్చట చ్యవనుడు తపస్సు చేయుట వలన పుట్టబాగా పెరిగి రెండు కన్నులు మాత్రము చాలా గొప్పగా ప్రకాశించుచూ కనబడెను. సంయాతరాజు చేసిన అపరాధమునకు చ్యవనుడు మన్నించగ తన కుమార్తెయగు సుకన్యను అతనికిచ్చి వివాహము చేసెను. అంతట ముసలివాడగు చ్యవనునితో కాలము గడుపుచున్న సుకన్యకు అశ్వినీదేవతల ఆశీస్సులచే నవయవ్వనుడిగా మారెను. ఈ కథ భారత - అరణ్య పర్వమున యున్నది.

ఇతడు ఇంద్రుని గర్వము కూడా అణచివేసెను. ఇది భారత అనునాశిక పర్వముద్వారా తెలియుచున్నది. చ్యవనుడు నహుషుని కూడా అనుగ్రహించెను. కుశిక భూపతిని కూడా పరీక్షించి అను గ్రహించెను. అలాగే అతనికి ఆశీస్సులను కూడా యిచ్చి నా తనయుని తనయుడు బూచీకుడనువాడు నీ తనయుని గాధికూతుర్ని పరిణయమై జమదగ్ని అనువానిని అటుపై అతనికి పరశురాముని గాధికి బ్రహ్మర్షియగు విశ్వామిత్రుడును కలుగునని చెప్పి వెడలి పోయెను.

దీనినిబట్టి ఈ చ్యవనుడు పరశురాముని అవతారమునకు కూడా మూల కారుకుడనియు, అలాగే త్రేతాయుగమున తాటకాసుర సంహార అనంతము సీతాకళ్యాణమునకు, అలాగే అహల్య శాప విమోచనమునకు కూడా శ్రీరామునికి ప్రియపాత్రుడై రాజర్షి బ్రహ్మర్షి

కూడా తాతముత్తాతల పితృవంశమునకు చెందినవాడుగ చెప్పకొన వచ్చును.

పై విషయమును బట్టి చూచినచో త్రేతాయుగమున రాక్షసుడగు లవణాసురిని శత్రుఘ్నుడు చంపుటకు శ్రీరాముని వద్దకు ఋచికాది మహర్షులతో కూడా వెళ్ళి శ్రీరామునితో ప్రస్తావించినది కూడా ఈ చ్యవనమహర్షే అని చెప్పవచ్చును. దీనిని బట్టి కృతయుగమున జన్మించిన భృగువంశము యొక్క వంశము త్రేతాయుగము వరకు శ్రీరామాదుల, పరశురామాదుల, విశ్వామిత్రాది తపోఋషులకు కూడా పేరెన్నికగన్న వంశోద్ధారకుడిగ వెలుగొందుటకు ఈ చ్యవనమహర్షి యొక్క ఇతివృత్తము ఈ ఋషులగాధలో పెరెన్నికగనవచ్చును.

¤❖❖❖❖❖¤

# ౧. జమదగ్నిమహర్షి

**1. యుగము**

కృతయుగమువాడైన భృగువంశ కుమారుడగు ఋచీకమహర్షి పుట్టెను.

**2. పురాణేతిహాసములు**

ఇతిహాసమైన భారత-అనుశాసినపర్వములో, అశ్వమేథ పర్వంలో పురాణములలో విష్ణుపురాణము, బ్రహ్మవైవర్తపురాణము, బ్రహ్మాండపురాణములోను ఇతనిని గూర్చిన ప్రస్తావన కలదు.

ఇతని జీవితములోని ముఖ్యమైన సన్నివేశములు ముఖ్యముగ సత్యవతి గర్భమున జమదగ్నిమహర్షియు, ఆమె మాతృగర్భమున విశ్వామిత్రుడును జన్మించెను. దీనికి కారణమైన కథ కూడా కలదు. చదువరులు ఆ జమదగ్ని ఇతివృత్త శీర్షికలో చదువుకొనగలరు.

జమదగ్నిమహర్షి ఉత్తమగుణసంపన్నుడైన రేణువు కుమార్తె యగు రేణుకకు వివాహము చేసుకొనెను. జమదగ్ని సూర్యుని శపించిన ఇతివృత్తము కూడా ఇతని చరిత్రలో మనకు తెలియగలదు. వారిద్దరికి జరిగిన సంవాదములో కూడా సూర్యుడు జమదగ్నితో పలికిన మాటలు మనకు తెలియనగును. బ్రహ్మమనుమడు వేదకర్త మహాతపఃశ్శాలి అయినవాడు జమదగ్ని. జమదగ్ని రేణుకతో పట్టపగలే సురతిక్రీడకు ప్రయత్నింపగ అతనిని సూర్యుడు వారింపచేసెను. ఆ సమయమున కోపించిన జమదగ్ని సూర్యునికి శాపమిచ్చెను. రాహుగ్రస్తుడవై పాప దృశ్యుడవు, హతరేజుడవు అగుదువని శపించెను. అందువలననే

సూర్యగ్రహణ కాలమున సూర్యునికి రాహువు మ్రింగబోవుననట్లుగ లోకమున ఒక విదితమైన ఇతి వృత్తము.

ఎప్పుడైతే సూర్యునికి జమదగ్ని శాపమిచ్చెనో ఆ క్షణముననే అష్టదిక్పాలకులలో ఒకడైన సూర్యుడు కోపించి జమదగ్నిని చూచి నీకు ఒక క్షత్రియునిచే పరాభవము. అతని ఆయుధముచే మరణించెదవని ప్రతిశాపమిచ్చెను. అటుపై జమదగ్ని మరల కోపగించుకొని నీవు శివునిచే జయింపబడెదవని మరల శపించెను. ఈ విషయమును తెలుసుకున్న సూర్యుని తండ్రి యైన కశ్యపుడు బ్రహ్మతో ఆలోచించి వారిద్దరి వద్దకు వచ్చి శాంత పరచిరి. అటుపై బ్రహ్మ ఓదార్చి సూర్యునితో ఒకానొకరోజున మేఘములు ఆకాశమున ఆవరించిన సమయమున గాని, వర్షంబున గాని రాహుగ్రస్థుడవు అగుదువని కొందరికి అదృష్టుడిగ, అగుదువు. కొందురు జాతకరీత్యా జన్మలగ్నమునకు సప్తమములోగాని, అష్టమములో గాని చతుర్ధదశమ స్థానములందు జన్మ ఋషమి ధనములందు నీవును చంద్రుడునా అదృశులయిరి. అలాగే అస్తకాల, ఘనాచ్ఛన్న కాల మధ్యాహ్నకాలము లందు జలములందు అర్ధోదిత కాలములందు నీవు పాపదృశ్యుడవగుదువు.

అలాగే జమదగ్నిని చూచి కార్తవీర్యునిచే పరాభవము, ఓటమి, మరణమును పొందుదువు. ముఖ్యముగ నీకు విష్ణుమూర్తియే కుమారుడిగ పుట్టి 21 సార్లు లోకమును జయించును. నీ మరణము లోకకళ్యాణమునకు బీజము కాగలదని ఒకరినొకరిని బ్రహ్మ, కశ్యపుడు సమాధానపరిచిరి. ఇకపోతే రేణుక జమదగ్నులకు వరుసగా ఋమాణ్వతుడు, సుశేషకుడు, వసువు, విశ్వావసువు, పరశురాముడు అను ఐదుమంది కుమారులు వరుసగా జన్మించిరి. ఈ ఇతివృత్తము బ్రహ్మవైవర్త పురాణమునందు కలదు.

జమదగ్ని ఇతివృత్తమునందు మనము తెలుసుకోవలసిన మరియొక ముఖ్యవిషయము పరశురాముని పితృభక్తి తల్లియగు రేణుక జలమునకై యేటికి పోయినపుడు చిత్రరథుడను రాజు భార్యాసహితుడై కలిగిన కామవికారమునకు ఆమెకు చివరికి భర్త మరణదండన విధించగ పితృభక్తిగ తల్లిని నరికిననూ తిరిగి తండ్రి వరము కోరుకొనమగా తిరిగి తన మాతృప్రేమతో భ్రాతృవాత్సల్యముతో తాను చంపిన తల్లిని, అన్నలను బ్రతికించుకొనెను. ఇలా ఎన్నో విశేషములు మన జమదగ్ని ఇతివృత్తమునందు కలవు.

### 3. జీవిత విశేషములు

జమదగ్ని జీవన విధానమున వివిధ ధార్మికమైన, మతపరమైన విషయములు కూడా ఇంచుక మనము పరిశీలించినచో జమదగ్ని కార్తవీర్యుని చంపిన పరశురాముని శిక్షించుట జమదగ్ని పితృదేవతల శాపమున నకులమై పుట్టిన వృత్తాంతమును ఇవన్నియు మనకు ఎన్నో విశేషాంశములు ఇతని చరిత్ర ద్వారా మహావిష్ణువు యొక్క దశావ తారములలో ఒకటైన పరశురామావతారమునకు ఈ రేణుకాయల్లమ్మ జమదగ్ని మహర్షి తల్లిదండ్రుల ఇతివృత్తము లోకమున ఎంతో ప్రసిద్ధిగాంచినవి.

¤❖❖❖❖❖¤

# 10. దత్తాత్రేయమహర్షి

### 1. యుగము, పురాణగాథ

కృతయగమునకు చెందిన మహర్షులలో ఒకడు అత్రిమహర్షి, దేవహూతి, కర్ధమ ప్రజాపతుల తొమ్మిదిమంది కుమార్తెలలో పతివ్రతా శిరోమణియైన అనసూయ ఒకటి. వీరిరువురికి కుమారుడే దత్తాత్రేయుడు.

ముఖ్యముగ దత్తాత్రేయుని తల్లియైన అనసూయను పూర్వము కౌశికుడను బ్రాహ్మణుని పత్ని సూర్యోదయమైన వెంటనే తన భర్త మరణించునని తెలుసుకొని సూర్యోదయము కాకూడదని శాసించెను. అటుపై లోకములన్నియును తల్లడిల్లగ దేవతలందరూ పతివ్రత శిరోమణియను అనసూయను ప్రార్థించిరి. ఆ సమయమున అనసూయ తన పాతివ్రత్యమహిమచే కౌశికుని బతికించుయు సూర్యోదయము అగునట్లును చేసెను.

ఆ సమయమున దేవతలందరు కోరుకొనగ బ్రహ్మవిష్ణు మహేశ్వరులును ముగ్గురును కుమారులై జన్మించెదరని కోరెను. అలా పుత్రకాంక్షగ అత్రి అనసూయల కోరిక మేరకు అత్రిమహర్షి వీర్యరూపమున విష్ణు అంశముగ బ్రహ్మవిష్ణుమహేశ్వరునిగ జన్మించిన వాడే దత్తాత్రేయుడు. ఇదియే పురాణగాథ. ఇతని ఇతివృత్తము పురాణముల ఆధారముగ మార్కేండేయ పురాణమునందు అనేక విషయములు మనకు తెలియుచున్నది. అందులో దత్తాత్రేయుడు జంబాది రాక్షసులను చంపించుట, కార్తవీర్యార్జునిని కటాక్షించుట, అలర్కునకు జ్ఞానమును బోధించుట, మొదలగు విశేషములు కలవు.

## 2. జీవిత విశేషములు

ఇకపై అతని జీవిత సన్నివేశముల్లో కొన్ని శీర్షికలు మనకు కలవు. అతడు చెప్పిన కొన్ని యోగవిషయములు సూక్ష్మముగ, తపమునకు తెలిసిన జ్ఞానమార్గము ఇలా తెలుసుకొనవచ్చును.

(1) ''వత్సా! శరీరమునందలి పరమజ్ఞానమునకు గురుడే యుపద్రష్ట. మోక్షార్థికి యోగము జ్ఞానపూర్వకమగును (2) ప్రకృతి గుణములో నేకత్వము లేకపోవుటయు బ్రహ్మైకత్వము కలుగుటయు ముక్తియన నొప్పను (3) ఆ ముక్తి పరమయోగమునగలుగును. యోగము సంగత్యాగము వలన సిద్ధించును. (4) సంగత్యాగము వలన నిర్వమత్వము దాని వలన వైరాగ్యము దాని వలన జ్ఞానము, దానివలన మోక్షమును సంభవించును. (5) యోగికి ముందాత్మ జయము కావలెను. కనుక బ్రాణాయామముచే నాతడాత్మదేహదోషము దహింపజేయవలయును (6) కామజములైన కర్మములు యోగవిఘ్న కార్యములగుట యోగి వానిని త్యజించి శుద్ధాత్ముడై పరమాత్మునితో ఐక్యమైపోవును. అట్టి యోగికి గౌరవము విషము. అవమానమే యమృతమగును. ఆ యోగి తనకున్న ఇల్లుగా దనయాకలికి దొరకి నదియే భోజ్యముగా దనకు గలదియే ధనముగా ముదమంది మమకారమునందడు కావున, నీవు విచారము దక్కియట్టి '' యోగ పురుషుడవై మోక్షవృత్తి మఱవకు'' మని యలర్కునకు బోధించెను.

పై విధముగ దత్తాత్రేయుడు ఋషివలన ఇతని జీవిత ఆధారముగ ఒక జ్ఞానపురుషునిగ, ఒక సద్గురు బోధకునిగ అనేకమంది ఋషులకు ఆదర్శస్వరూపుడుగ లోకమున జ్ఞానమార్గనిర్దేశనమును చేసిన మహాగురువు శ్రీదత్తాత్రేయుడు.

### 3. రచయిత అభిప్రాయము

ప్రస్తుతము కర్ణాటకలోని గుల్బర్గాసమీపమున 36 కి॥మీ॥ సమీపమున "గాముగా"(గాణ్గాపురము) అను క్షేత్రమున శ్రీదత్తాత్రేయ వైభవము వేనోళ్ళకొనియాడబడుచున్నది. అలాగే మాలాద్గురువులైన శ్రీ అక్కల్కోట మహారాజు శ్రీషిరిడీ సాయిదేవుడు ఈశ్వరాంశ సంభూతులుగ దత్తాత్రేయ అవతార స్వరూపులుగ వేనోళ్ళ పూజలందు కొనుచున్నారు.

చివరిలో దత్తాత్రేయమహర్షియొక్క జీవనవిధానము, అతని గూర్చిన ప్రార్థన కూడా, అతని వేషధారణ, అతని ప్రవృత్తి ఎటువంటిదో కూడా మనము తెలుసుకొనవచ్చును. ఈ విధముగా -

దత్తాత్రేయమహర్షి సంగమును విడనాడుటకై వివిధ వేషము లగైకొనువాడు. విల్లునమ్ములు కొని వేటకుక్కలు వెంటరాగా జెంచు వానివలె నుండువాడు. కాఅడవిలో గిరాతతతియుండెడుచో నుండి మద్యమాంసములు సేవించువాడు. మాలపల్లికేగి చండాలురతో గూడి మద్యమును గ్రోలువాడు. ఉన్మత్తుడైనట్లు విహరించువాడు. ఐన, నాతడు మహాయోగీశ్వరేశ్వరుడు. విచిత్ర చరిత్రుడు.

శ్లో॥ విభుర్నిత్యానంద శ్రుతిగణశిరో వేద్యమహియా
యతో జన్మాద్యస్య ప్రభవతి స మాయాగుణవతః,
సదాధార స్యత్యో జయతి పురుషార్థైక ఫలదః
సదా దత్రాత్రేయో విహరతి ముదా జ్ఞానలహరిః.

¤ ❖❖❖❖❖ ¤

# 11. దధీచిమహర్షి

**1. యుగము**

కృతయుగమునకు చెందిన భృగుమహర్షి - పులోమిల యొక్క కుమారుడు చ్యవనమహర్షి, ఆ చ్యవనమహర్షికి -సుకన్యకు కలిగినవాడే దధీచిమహర్షి.

**2. పురాణగాథ**

దధీచి గురించి బ్రహ్మపురాణము,శివపురాణము, స్కాంద పురాణ మహేశ్వర, కేదార ఖండములయందు యితని ఇతివృత్తమును తెలుపబడినది.

**3. జీవనవిధానము-దధీచి ఋషి జీవితమున జరిగిన కొన్ని ముఖ్య సన్నివేశములు -**

(1) దధీచికి - సరస్వతికి కలిగినవాడే సారస్వతుడు. అతడు భవిష్యత్ కాలమున గొప్ప క్షామ సమయములో తన నిజశక్కిచే మహర్షులను కాపాడగలడని తనను రక్షించమని సరస్వతి వద్దకే ఆ కుమారుని పెంచి పెద్ద చేసెను.

(2) ఇంద్రుడే దధీచికి అనేక శాస్త్రములను ఉపదేశించెను. కాని అతడు (ఇంద్రుడు) దధీచికి ఒక షరతును విధించెను. నీవు ఈ శాస్త్రములను ఎవరికైననూ ఉపదేశించినచో ఆనాడే నీ శిరస్సును నేను ఖండించెదనని అని హెచ్చరించెను.

(3) అటుపై అశ్వినీదేవతలు అతని చెంతకు వచ్చి ఆ శాస్త్ర రహస్యములను తెలుపమని వేడుకొనెను. మేము ముసలివాడైన నీ తండ్రి చ్యవనునికి నవ యవ్వనమును ఒసగినవారము కావున ఆశాస్త్రములను మీకు బోధించమని అడిగెను.

(4) అటుపై దధీచి దీనివలన నాకు ఇంద్రునిచే ఉపద్రవము కలుగనని చెప్పగా దానికి వారు నిన్ను మేము కాపాడెదమని చెప్పి దధీచి తల తీసి ఒక అశ్వశిరమును అతికించి శాస్త్రములను గ్రహించి అతని పూర్వశిరమును భద్రపరచెను. కాని కోపంచిన ఇంద్రుడు దధీచి శిరస్సును నరికి వెడలిపోగా అశ్వినీదేవతలు అతని పూర్వశిరస్సును దధీచికి అతికించి తిరిగి కాపాడెను.

(5) మరియొక ఇతివృత్తములో దధీచి దక్షుని శపించెను. అలాగే ఒక దేవకార్యములో కూడా దధీచి తన దేహత్యాగమును చేసెను. ఇవన్నియు కూడా దధీచి ఇతివృత్తమున ముఖ్యఘట్టములుగా చెప్పుకొనవచ్చును.

(6) పూర్వము వృత్రాసురుడను రాక్షసుడు దేవతలను చాలా బాధలు పెట్టుచుండగ వీరందరు బ్రహ్మదేవుని సమీపించి ఆ వృత్రాసురుని నుండి మమ్ముల రక్షింపుమార్గమును తెలియజెప్పమనగ బ్రహ్మ వారికి "మీరు దధీచి వద్దకుపోయి అతనిని ప్రార్థించి అతని అస్థులను ఆయుధములుగ ఉపయోగించినచో ఆ వృత్రాసురుని బాధ తప్పునని" హితము ఉపదేశించెను.

ఇంద్రాదులందరూ కూడా భయకంపితులై దధీచుని దగ్గరకు వచ్చి నిన్ను మేము చంపినచో బ్రహ్మహత్యాపాపము సంభవించును. కావున దీనికి మీకు స్వచ్ఛంద మరణమును ఈశ్వరుడు అనుగ్రహించితే తప్ప యితరులెల్లరు నిన్ను చంపరు అని చెప్పగా దధీచి " నేనే

యోగాగ్నిలో మరణించెదదని'' మీరు మీకర్తవ్యమును కావించుకొనెడని యోగాగ్నిని కల్పించుకొని పరబ్రహ్మ అనుసంధానమున దేహమును త్యజించి పరమశివునిలో ఐక్యమయ్యెను.

అటుపై దేవతలు గోగణమును ప్రార్థించి వానిచే పరిశుద్ధము చేయబడిన దధీచి అస్థులచే బ్రహ్మచక్రమును వజ్రాయుధమును మున్నగు ఆయుధములను చేసుకొని రాక్షసులను దేవతలు చంపివేసిరి.

మనకు పై విషయములు స్కాందపురాణ, బ్రహ్మపురాణ, శివపురాణములలో చెప్పబడినది.

పై దధీచి వృత్తాంతమును ఆలోచించినచో అతని జీవితములో జరిగిన సంఘటనలను దేవలోకమునకు ఉపయోగపడినట్లుగా శాశ్వతమైన తపోదీక్షతో ఋషి ప్రఖ్యాతులలో భృగుమహర్షి మనుమడు, చ్యవనుని కుమారుడైన దధీచి తన మరణము సైతము లెక్కచేయక తాను దేవతలకై యోగాగ్నిలో మరణించి శివైఖ్యము చెంది తన అస్థులను క్రూరమైన వృత్రాసురాది రాక్షసుల ''దుష్టశిక్షణ శిష్టరక్షణ''గా అన్నట్లుగా ఉపయోగపడెనని ఈ ఋషుల గాథలు ఇతివృత్తములో ఈ పై వారందరూ మనకు కారణజన్ములుగ లోకహితోపమునకై జన్మించిరని మనకు తెలియుచున్నది.

ఇప్పటికిని భూలోకమున నైమిశారణ్య సమీపమున దధీచి మహర్షి ఆశ్రమము గోమతీనదీ తీరమున కలదు. ఇటువంటి మహత్తరమైన ఈ దధీచి ఇతివృత్తము నైమిశారణ్యమును ఆసరాగా చేసుకొని పదునెనిమిది పురాణములను రచించిన వేదవ్యాసుని రచనలలోని స్కాంధపురాణము, బ్రహ్మపురాణము, శివపురాణము ఇత్యాది పురాణములలో ఇతని మహత్తర విషయాంశములు

తెలుపబడినవి. ముఖ్యముగా స్కాందపురాణమున మహేశ్వర ఖండమున, కేదార ఖండమున ఇతని మహత్తరములు తెలుపబడినవి.

#### 4. జీవత విశేషాలు

ఇకపోతే చివరిగా అతని శిష్యుల పరంపరగా జీవన విధానమును ధార్మికమైన, మతపరమైన విషయములను తెలుసు కోవటంలో కొన్ని విషయములను సంగ్రహించవలెను.

దధీచిమహర్షి చనిపోవునాటికి అతని భార్య సువర్చ గర్భవతి అయి ఉండెను. ఎప్పుడైతే దేవతలకొరకై దధీచుడు ప్రాణత్యాగము చేసెనో అప్పుడే సువర్చల నిండుగర్భముతోను ప్రాణత్యాగము చేయ బోయెను.

అంత బ్రహ్మాది దేవతలు ప్రత్యక్షమై "ఓ స్వాధ్వీ! నీ గర్భమున మహాత్ముడగు కుమారుడున్నాడు. ప్రాణత్యాగము చేయకుము" అని పలికెను. అంతట బాధతో కూడిన సువర్చ నాకు వైధవ్య దుఃఖమును యిచ్చుటకొఱగు యిట్లు పన్నాగము పన్నితిరా నాభర్తను చంపిన దేవతలు పశువులై ప్రవర్తింతురు గాక యని శపించి భర్త చితినెక్కెను. అంతలో ఆమె గర్భమునుండి ఒక బాలుడు జారి సమీపముననున్న ఒక పిప్పల వృక్షము దగ్గర పడెను. ఆమె చితిలో భస్మమైపోయెను.

అట్లు జనించిన వాడే పిప్పల వృక్షము క్రింద పెరిగిన వాడే పిప్పలాదమహర్షి. అటుపై పిప్పలవృక్షము అతనిపై జాలిగొని చంద్రునర్థించి అమృతమును తీసుకొనివచ్చి ఆబాలుని పోయగా అతడు ఆకలి దప్పులు లేక చక్కగా పెరిగి పిప్పలుడిని పేరు గాంచెను.

చివరగా తన తండ్రిని చంపిన దేవతలను చంప పిప్పలుడు శివునిగూర్చి తపస్సు చేసెను. అప్పుడు దేవతలు శివుని శరణువేడగా

శివుడు పితృలోకమున తల్లిదండ్రులను చూడగలుగు వరమిచ్చి అదృశ్యుడయ్యెను. ఇలా లోక ప్రఖ్యాతుడై మహత్తరమైన తండ్రికి తగ్గ తనయుడిక దధీచికి జన్మించిన పిప్పలుడు పేరుగాంచుటకు ఈ దధీచిమహర్షి తండ్రియగు చ్యవనుడు, తాతయగు భృగుమహర్షి యొక్క ఇతివృత్తములు లోకమున వారి జీవన విధానము ధార్మిక, మతపరమైన విశేషాంశములుతో కూడిన ఋషులు గాథలలో మనకు ఎన్నియో ఆదర్శవంతమైన ఋషిచరిత్రలు లోకప్రఖ్యాతములుగ తెలియబడుచున్నవి. సమీక్షా నిర్వాహకులు యిచ్చిన సూచనల మేరకు సూక్ష్మీకరములో ఈ పై విషయములను మనము తెలుసుకొనవచ్చును.

¤❖❖❖❖❖¤

## 12. దుర్వాసమహర్షి

### 1. యుగము, పురాణగాథ

కృతయుగము వాడైన అత్రిమహర్షి అనసూయల శివాంశ సంజాతుడే దుర్వాసుడు. ముఖ్యముగ పురాణకదితముగ పూర్వము హయహయుడు అను రాజొకడు దుష్టుడై అననూయకు గర్భనిరోదమును కావించెను. ఆ రాజు యొక్క గర్వమును అణచుటకు కోపము దాల్చి గర్భావాసమున ఏడుదినములుండి దుర్వాసుడను నామమున తపోగుణ ఉద్రిక్తుడై అవతరించెను. వెంటనే అతని తేజోంశమున హయహయుడు భస్మమయ్యెను.

వేదవ్యాసుడు విరచించిన అనేక పురాణములలో ఇతని ఇతివృత్తము కలదు. ముఖ్యముగ విష్ణుపురాణము, పద్మపురాణ, భూమిఖండము, వరాహ, బ్రహ్మ పురాణమున, మార్కండేయ పురాణము, బ్రహ్మవైవర్త పురాణము, భాగవత పురాణము, శివ పురాణములలో కలదు.

అలాగే పంచమ వేదమైన మహాభారత ఆది, అరణ్య, అనుశాసనిక పర్వములలో యితని ఇతివృత్తము కలదు.

ద్వాపరయుగములోను నాటి మహాభారత కథ కౌరవపక్షపాతిగ యున్న కర్ణుని జననమునకు కుంతి తనకు చేసిన సేవలకు దూర్వాసుని మంత్రాశీస్సులే తాము సూర్యుని తలచి కుమారుని పొందుటకు కారణగాథ అయ్యెను.

**2. జీవన విధానము, సన్నివేశములు**

ఈ ఋషి జీవితరథముగ దూర్వాసుడు అనగానే మహారుద్రస్వరూపుడు, మహాకోపిష్టి, ఇంద్రుని శపించిన వాడు కూడా దుర్వాసురుడే. అలాగే సుప్రీతుని కూడా అనుగ్రహించినవాడు దుర్వాసురుడే. వప్రవు అను అప్సరసను కూడా శపించిన వాడు దూర్వాసురుడే. దుర్వాసురుడు ఔర్వమహర్షి కుమార్తెయగు కందలిని వివాహమాడెను. అంబరీషునిచే పరాభవింపబడిన శబరతాపసుని పరీక్షించి వరములొసగెను. ముద్గలునకు అతిథి అయ్యెను. యోగ మాయెను వివాహమాడెను. ద్వాపరయుగములో ఇతని ఇతివృత్తము అనేక వివాహముల తెలుసుకొనదగిన సూక్ష్మాంశములెన్నియో మనకు గలవు. పార్వతీదేవియే శ్రీకృష్ణుని గూర్చి తెలియజేసెను.

చివరకు ద్వాపరయుగమున అంతమగుటకు కూడా ఇతని కోపశాపవశమే కారణమయ్యెను. శ్రీకృష్ణుని యాదవులను కూడా శపించినవాడు ఇతడే. అలాగే త్రేతాయుగమున లక్ష్మణుని మరణము నకు కారణమయిన వాడు దుర్వాసుడే. ఇలా అనేక యుగములలో కృత-త్రేతా-ద్వాపరయుగములలో ఈ దుర్వాసమహర్షి ఇతివృత్తము ఈ ఋషుల గాథలలో మనము తెలుసుకొనదగిన సూక్ష్మాంశము.

దుర్వాసురుడు చెప్పిన కవచ స్తోత్రములలో రుద్రకవచము చాలా గొప్పది. ఇది స్కాందపురాణమున లభ్యమయ్యెను. పై విధముగ ఈ దుర్వాసమహర్షి చరిత్ర అవతారపురుషులైన శ్రీకృష్ణాదులకు, రాముని సోదరుడైన లక్ష్మణుని మరణమునకు, కారణభూతమైనట్లే, పరమేశ్వర అంశసంభూతుడైన ఈ దుర్వాసమహర్షి తన శిష్య ప్రశిష్యులకు ఎన్నియో స్వచ్ఛమైన విద్యారహస్యములను ఆమూలా

గ్రముగ ఎరిగించినవాడు. త్రిలోకపూజ్యుడు, లోకక్షేమకరుడు, అనసూయా గర్భసూక్తి మూక్తాఫలము, దేవహూతి, కర్ధమప్రజాపతుల దౌహిత్రుడు తపోనిష్టాగరిష్ఠుడు, అత్రిమహర్షియొక్క తపఃస్సారము, రుద్రాంశసంభూతుడు దుర్వాసమహర్షి. మహర్షులలో అప్రతిమానుడిగ ఈ ఋషులగాథల శీర్షికలలో మనమించుక సూక్ష్మీకరించు కొనవచ్చును.

### 3. ముగింపు

పైవిధముగ పై రెండు భాగములలో కలిగిన వరుసగా పన్నెండ్రుమంది ఋషుల జీవనయాన సన్నివేశ హైందవ సంస్కృతి ఆదర్శవంశ, జ్ఞానసంపద నిధి నిక్షేపమును వేదోపనిషత్తుల ప్రచారోప భాగములుగ లోకమునకు తెలియననుటకు ఈ పై ఋషులగాథలే మనకు ఆదర్శనిదర్శనములు.

¤❖❖❖❖❖¤

## అష్టాదశ పురాణములు - ఋషుల ప్రస్తావన

**1. శ్రీ బ్రహ్మ మహాపురాణము**

**2. పద్మ మహాపురాణము**

1. చ్యవన మహర్షి చరిత్ర వర్ణనము
2. చ్యవన మహర్షి చరితము
3. వ్యాసుని జననము గూర్చిన కథ
4. మరుత్తుల ఉత్పత్తి - దితి కశ్యపుని వలన గర్భము పొందుట
5. ఋషులు పుష్కర తీర్థము విభాగము చేయుట
6. బ్రహ్మ ఋషులకు వరమిచ్చుట
7. పుష్కర తీర్థ క్షేత్ర మహాత్మ్యము
8. దధీచి వృత్తాంతము
9. రాముడు అగస్త్యాశ్రమమునకు వచ్చుట

**3. శ్రీ విష్ణు మహాపురాణము**

1. భృగు సర్గాది వర్ణనము

**4. శ్రీ వాయు మహాపురాణము**

1. శ్రీ మహాపురాణ వాయుప్రోక్త ఋషి వంశాను కీర్తనం
2. శ్రీ మహాపురాణ వాయుప్రోక్త ఋషి లక్షణము
3. కశ్యపీయ ప్రజాసర్గము - 4 భాగములు

**5. శ్రీమద్భాగవత మహాపురాణము**

1. వ్యాసుని కడకు నారదుడు వచ్చుట
2. శుక మహర్షి పరీక్షిన్మహారాజు వద్దకు ఏతెంచుట

3. శుకుడు పరీక్షిత్తునకు ముక్తిమార్గము తెల్పుట
4. శుకుడు పరీక్షిత్తునకు భక్తిమార్గంబె ముఖ్యమని తెల్పుట
5. కర్దముడు భగవదనుజ్ఞ బడసి దేవహూతిని పెండ్లియాడుట
6. దేవహూతి గర్భమున విష్ణుమూర్తి కపిలాచార్యుడుగా పుట్టుట
7. దేవహూతి పుత్రుండైన కపిలుడు తత్త్వజ్ఞానంబు బడయుట
8. కపిలుడు దేవహూతికి భక్తియోగమును తెలియచేయుట
9. కపిలుడు దేవహూతికి పిండోత్పత్తి క్రమమును తెలియచేయుట
10. గర్భస్తుండగు జీవుడు భగవంతుని స్తుతించుట
11. కర్దమ ప్రజాపతి సంతతిని తెలుపుట
12. ఋషభుండు పుత్రులకు నీతిఉపదేశించుట
13. నారదుడు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మంబులు తెలుపుట
14. నారదుని పూర్వజన్మ వృత్తాంతము
15. నారాయణ కవచము
16. మరుద్గణముల జన్మవృత్తాంతము
17. దత్తాత్రేయావతారము, నారాయణావతారము
18. నారద - ప్రచేతస సంవాదము

**6. శ్రీ నారద మహాపురాణము**

1. గౌతమ ఆశ్రమ మహాత్మ్యము
2. మార్కండేయ మహర్షి ప్రళయమును దర్శించి, పురాణమును రచించి పరమపదమును చేరమని శ్రీమహావిష్ణువు వరమిచ్చుట
3. బ్రహ్మ సభకు బయలు దేరిన సనక సనందులను గంగా తీరమున నారద మహర్షి విష్ణువును ప్రసన్నుని చేయు ఉపాయమును అడుగగా పురాణోప న్యాసమున విష్ణుస్తుతి
4. భరద్వాజ-భృగు సంవాదమున జగత్సృష్టి నిరూపణము

**7. శ్రీ మార్కండేయ మహాపురాణము**

1. దత్తాత్రేయ మహాత్మ్య వర్ణనము.
2. దత్తాత్రేయ ఉపాఖ్యానము.

**8. శ్రీమదగ్ని మహాపురాణము**

1. దుర్వాసుడు దేవతలను శపించుట.
2. నవవిధ సృష్టి - దక్షకన్యలు భృగ్వాదుల వరించుట
3. సోమాదులు - వాలఖిల్యులు ఉత్పత్తి చెందుట
4. హింసా - ధర్ములకు అనృతాదులు జనించుట
5. అగస్త్య అర్ఘ్యప్రదానము.

**9. శ్రీ భవిష్య మహాపురాణము**

1. బ్రహ్మర్షి సంవాదమున ప్రవర వర్ణనము

**10. శ్రీ బ్రహ్మవైవర్త మహాపురాణము**

1. నారదుడు సృంజయ కన్యను వివాహమాడుట
2. సనత్కుమారుడు స్త్రీ ప్రేమలో పడిన నారదునకు బోధ చేయుట
3. కృష్ణమంత్రోపదేశము
4. నారదునితో శివుడు కృష్ణ ధ్యానాన్ని చెప్పుట
5. యాజ్ఞవల్క్య మహర్షి కృత సరస్వతి స్తోత్రము
6. ఇంద్రునకు దుర్వాస మహర్షి శాపము
7. జమదగ్ని - కార్తవీర్యుల చరిత్ర, యుద్ధము
8. బ్రహ్మ దేవుడు జమదగ్ని - కార్తవీర్యుల యుద్ధమును నివారించుట
9. పరశురాముడు కైలాసమునకు పోవుట.
10. పరశురాముడు శివుని దగ్గర అస్త్రశస్త్ర విద్యలను అభ్యసించుట
11. పరశురామునకు శ్రీకృష్ణ మంత్రోపదేశము
12. పరశురామునకు శ్రీకృష్ణ స్తోత్రమును ఉపదేశించుట

13. కార్తవీర్యుడు పరశురామునితో యుద్ధము చేయుట
14. నారాయణుడు పరశురామునకు శివకవచమును ఉపదేశించుట
15. పరశురామునకు శ్రీమహాలక్ష్మీ కవచము ఉపదేశించుట
16. కైలాసమున గణపతి - పరశురాముల సంవాదము
17. పరశురాముడొనరించిన దుర్గాస్తోత్రము
18. పరశురామునకు భద్రకాళి కవచమును ఉపదేశించుట

**11. శ్రీ లింగ మహాపురాణము**

1. వ్యాస యోగాచార్య నిరూపణము
2. దధీచి - క్షిప సంవాద వృత్తాంతము

**12. శ్రీ వరాహ మహాపురాణము**

**13. శ్రీ స్కాంద మహాపురాణము**

1. ఋష్యశృంగ స్వర్గ ప్రయాణము
2. జైమిని ఋషి సంవాదము
3. బ్రహ్మ ఆజ్ఞచే దేవతలు దధీచి ఆశ్రమమునకు వెళ్ళి దధీచిని అస్థికలిమ్మని ప్రార్థించుట
4. దధీచి యోగమార్గమున తన శరీరము విడచుట
5. దధీచి పత్నియగు సువర్చ దేవతలను శపించుట
6. సువర్చ తన పుత్రుడగు పిప్పలాదుని అశ్వత్థ వృక్షము వద్ద ఉండమని ఆజ్ఞాపించి సువర్చ సమాధి స్థితిలో పతిని అనుసరించుట
7. యజ్ఞవల్క్యుడు నకులను అవమానించుట
8. లోమశ మహర్షి, మార్కండేయ మహర్షి జీవన్ముక్తులగుట
9. అగస్త్య తీర్థ ప్రశంస
10. అగస్త్యుడు వింధ్యపర్వతాన్ని నిగ్రహించుట

11. జటాతీర్థము - భృగువు, దత్తాత్రేయుడు, శుకుడు స్నానము చేసిన చోటు. రాముడు తన జటలను కడిగిన ప్రదేశము

**14. శ్రీ వామన మహాపురాణము**

**15. శ్రీ కూర్మ మహాపురాణము**

1. ఈశ్వర గీత. ఋషి - వ్యాస సంవాదము
2. వ్యాసుని ధర్మోపదేశములు

**16. శ్రీ మత్స్య మహాపురాణము**

1. ఋషి గోత్ర ప్రవర వర్ణము
2. అత్రి గోత్ర ప్రవరాను వర్ణము
3. విశ్వామిత్ర గోత్ర ప్రవరాను కీర్తనము
4. కశ్యప గోత్ర ప్రవరాను కీర్తనము
5. వశిష్ఠ గోత్ర ప్రవరాను కీర్తనము
6. వశిష్ఠ - నిమి చరితము
7. వశిష్ఠ - పరాశర వంశాను కీర్తనము
8. అగస్త్య గోత్ర ప్రవరాను కీర్తనము
9. ధర్మనామ ఋషివంశ వివరణము
10. ఋషుల ప్రశ్నము - మత్స్యావతార కథనము
11. కశ్యప సంతతి
12. మరుదుత్పత్తి - మదన ద్వాదశీ వ్రతము
13. కశ్యపుడు దితికి చెప్పిన గర్భిణీ స్త్రీ ధర్మములు
14. అగస్త్య ఉత్పత్యాది కథనము
15. అగస్త్య పూజా విధానము
16. నారదుడు త్రిపురములకేగుట
17. నారదుడు త్రిపురములనుండి తిరిగి వచ్చుట

**17. శ్రీ గరుడ మహాపురాణము**

**18. శ్రీ బ్రహ్మాండ మహాపురాణము**

1. వ్యాస శిష్యోత్పత్తి వర్ణము
2. ఋషి సర్గము వర్ణనము
3. ఔర్వ పరశురామ సంవాదము
4. జమదగ్న్య తపశ్చరణము

**19. శివ మహాపురాణము**

1. పద్మ - పిప్పలాదుల చరితము
2. అనసూయ అత్రుల తపోవర్ణనము
3. అత్రీశ్వర మహాత్మ్యము
4. గౌతముని ప్రాయశ్చిత్తము
5. త్రయంబకేశ్వర మహాత్మ్యము
6. గౌతముని శాపవిమోచనము
7. గౌతమునియొక్క పరోపకార శీలము
8. కశ్యప వంశ వర్ణనము - మరుత్తుల చరిత్రము
9. వ్యాసుని జననము
10. వామదేవ మహర్షి కుమారస్వామిని ప్రార్థించుట
11. నైమిషీయ మహర్షుల చరిత్ర

ꕥ ❖❖ ❖ ꕥ

## అనుబంధము

## రచయిత రచనలు

1. అయ్యప్పస్వామి శరణామృత వర్షిణీ
2. ఓమ్ శ్రీకృష్ణ కరుమారుయమ్మ
3. శ్రీ తలకోన క్షేత్ర మహత్మ్యము
4. నర్రవాడ వెంగమాంబ గొలుగుకథ
5. శ్రీ షిర్డీసాయి సుందరగానములు
6. శ్రీ స్కంద సృష్టి కవచము
7. కార్తీక పురాణము
8. శివ పురాణము
9. మాఘ పురాణము
10. శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యము
11. ద్వాదశ జ్యోతిర్లింగ మహిమ
12. శివరాత్రి మహాత్మ్యము
13. శ్రీ రాహుకేతు దోషనివారణ
14. శ్రీ వైభవలక్ష్మీ మహాత్మ్యము
15. శ్రీలక్ష్మీ శ్రీవేంకటేశ్వర పూజా విధానము
16. భారత భాగవతాల్లో శ్రీకృష్ణుడి పాత్ర
17. శ్రీ తలకోన క్షేత్ర ప్రతిష్ఠా
18. శ్రీ తలకోన సిద్దేశ్వర శివాత్మక శతకము
19. శ్రీ ఆవణి క్షేత్ర మహాత్మ్యము
20. శ్రీ షిర్డీసాయి స్తోత్రమంజరి
21. శ్రీ అరుణాచల మహాత్మ్యము
22. శ్రీ షిర్డిసాయి గానామృతము
23. శ్రీదేవీ దర్శనము
24. శ్రీకృష్ణాపుష్కర మహాత్మ్యము
25. శ్రీశైల క్షేత్ర మహాత్మ్యము

*******